## శ్రీ జాషువకవిగారి ఖండకావ్యములు.

| | | | | |
|---|---|---|---|---|
| ఖండకావ్యము | 1 వ భాగము | 1 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 1 | 0 | 0 |
| డిటో | 3 వ భాగము | 1 | 0 | 0 |
| గబ్బిలము | 1 వ భాగము | 1 | 0 | 0 |
| డిటో | 2 వ భాగము | 1 | 0 | 0 |
| ఫిరదౌసి | | 1 | 0 | 0 |
| నేతాజీ | | 1 | 0 | 0 |
| బాపూజీ | | 1 | 0 | 0 |
| కాందిశీకుడు | | 1 | 0 | 0 |
| స్వప్నకథ | | 1 | 0 | 0 |
| ముంటాజ్‌మహల్ | | 1 | 0 | 0 |
| స్వయంవరం | | 1 | 0 | 0 |
| తెరచాటు (నాటకం) | | 1 | 8 | 0 |
| వీరాబాయి (నాటకం) | | 1 | 8 | 0 |

వలయువారు :—

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

# కాంతంకాపరం



శ్రీమునిమాణిక్యం నరసింహారావు బి. ఏ. యల్. టి.



పబ్లిషర్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,
బుక్ సెల్లర్సు అండ్ పబ్లిషర్సు
రాజమండ్రి.

# విషయసూచిక

# కృతజ్ఞత

ఈకథలు చిన్నప్పుడు మా శివశంకరశాస్త్రిగారు నాలో పెంపొందించిన ఉపజ్ఞకు ఫలితాలు. వారు చూపిన దారిలోనే ఇవి ఇంతవరకూ రాణించి ఆంధ్రుల అభిమానాన్ని పొందినవి.

నాకు దేశంలో కొద్దో గొప్పో పేరుప్రతిష్ఠలు తీసుకొచ్చిందీ, నన్ను కథకునిగా తయారుచేసిందీ, మా శివశంకరశాస్త్రిగారే.

అందుకని నిజంగా నేను పుస్తకం వ్రాసి కృతజ్ఞత చూపాలిసింది మా సాహితీసమితి సభాపతులకే. అప్పుడప్పుడు మిత్రులు బాగున్న విషయాలను మెచ్చుకుంటూ నాలో ఉత్సాహం పురికొల్పినా అవి క్షణికాలు.

నిజంగా చేయూతా, స్థానం, యిచ్చింది మా శాస్త్రిగారే.

మా సాహితీసమితి సభాపతులూ, పండితులూ, దేశభక్తులూ, ఉత్తమకవులూ, నాకు గురుమూర్తులూ అయిన శ్రీ శ్రీ శివశంకరశాస్త్రి గారికి నా కృతజ్ఞతను విన్నవించుకొంటున్నాను.

# మా గృహనిర్మాణం

ఈఅద్దె కొంపలలో ఉండి అవస్థలు పడలేక స్వంతఇల్లొకటి కట్టించుకోవలెనని అభిలాషపడ్డాను. ఇల్లుగట్టిచూడండి. పెండ్లి జేసిచూడండి అన్నారు. ఇది లోకోక్తి. ఇల్లుకట్టి చూడండి అన్నారుగానీ ఇల్లు కడతానని కొంపలో అని చూడండీ తెలుస్తుంది! నేనన్నానేమో అనుభవించానేమో చెపుతాను ఆ సంగతి ముందు మా శిరోమణి సంగతి చెప్పనీయండి.

ఎందుకంటే ఇల్లుకట్టటంఅంటూ వస్తే శిరోమణిప్రశంస లేకుండా ఉండటానికి వీల్లేదు. పాండవారణ్యవాస కథ చెప్పటానికి నలోపాఖ్యానం ఎట్లా అవసరమయిందో, అట్లాగే నాగృహనిర్మాణ ప్రయత్నానికి ముందు మాశిరోమణి సంగతి చెప్పటం అవసరం అయింది.

మాశిరోమణికీ ఒకసారి...ఇల్లు గట్టాలని బుద్ధిపుట్టింది. అతనివద్ద చేతిలో నాలుగువందల రూపాయలూ ఉన్నాయి. గుంటూరులో వెయ్యి గజాల నివేశన స్థలమూ ఉంది. ఆస్థలంలో ఒక చక్కని గృహనిర్మాణం చేయాలని అతనికి ఒక పెద్ద ఊహ కలిగింది. నాలుగువందలు పెడితే ఏదో ఒకరకం కొంప ఒకటి కట్టటం అంత అసాధ్యమైన పనికాదు. కానిఅతని ఉద్దేశం అతితక్కువ మొత్తంతోనే అన్ని సౌకర్యాలు కమాండుచేసే ఇల్లు కట్టాలని.

గృహనిర్మాణాన్ని గురించి కొన్ని పుస్తకాలు చదివితే తాను చౌకగా ఇల్లు కట్టడమే కాకుండా అఖిలాంధ్రావనికి కూడా ఒక నిరాడంబరమైన ఆదర్శాన్ని కల్పించవచ్చునని తోచింది.

"వెధవలు, మన ఆంధ్రులకూ బుద్ధిలేదు. వేలకు వేలు పోసి లంకంత లోగిళ్ళు కడతారు. దరిద్రపు కొంపలుగొడ్ల సావిళ్ళలాగ తయారు అవుతాయి. గాలి వచ్చేమార్గమూ ఉండదు. పడకగదీ అంటూ అసలుఉండదు. చచ్చేటంత సుందంగా గోడలూ, దయ్యాలలాంటి సావిళ్ళూనూ. ఎందుకూ పనికిరాకుండాకడతారు. ఇంకోపద్ధతిలో కట్టడమూ తెలియదు." అని అంటూ ఉపన్యాసం సాగించాడు శిరోమణి ఆరోజునుంచీ.

ఇక గృహనిర్మాణాన్ని గురించి చదవాలె. తదర్థం హిగింబాదమ్స్ నుండి కాటాలాగు ఒకటి ముందు తెప్పించాడు. ఇల్లుకట్టడానికై నిలువ ఉంచుకొన్న నాలుగువందలలోనుంచీ పుస్తకాలకోసం డబ్బు ఖర్చుపెట్టడం తెలివితక్కువపనీ అని అతనికి తెలియక పోలేదు. అందుకని ఇరవైరూపాయలు మాత్రం వ్యయంచేసి నికరమైన జ్ఞానాన్ని ఇచ్చే పుస్తకాలు కొన్ని మాత్రం తెప్పించాడు.

అవి క్షుణ్ణంగా చదివాడు. జపానువారి గృహనిర్మాణ పద్ధతీ, ఇంగ్లండులో కంట్రీ హౌస్ నిర్మాణమూ, జర్మనీలోపద్ధతీ నీగ్రోలు, ఎస్కిమోలు మొదలగువారు ఇండ్లు కట్టేపద్ధతీ వారి

నేర్పరితనమూ, మొదలైన విచిత్ర విషయాలు ఎన్నో మాకు ఆయన చెపుతూఉంటే మేము ఆశ్చర్యంతో చెవులునిక్కపొడుచుకొని వింటూ ఉండేవాళ్ళం.

తదుపరి దొంగలకు అలవికాని ఇళ్ళుకట్టే పద్ధతినిగురించి చెపుతూ ఉండేవాడు. ఒకదానిపక్కన ఒకటిఒకటిన్నర అంగుల ఎడంలో, రెండు గోడలు ఒక ఇటుక వరసమందాన లేపి ఆరెండు గోడలమధ్యా ఇసుకపోస్తే, ఇక దొంగ అక్కడ కన్నం వేయటానికి వీలులేదు. అతిచౌకలో దొంగలకు అలవిగాని ఇల్లుకట్టే పద్ధతి ఇది. ఇల్లాగ నాలుగుగోడలూ కట్టిన గదిలో బంగారంపారేసుకున్నా దొంగలకు అందదు అని అంటూ ఉండేవాడు. ఆయన చెప్పే పద్ధతులు విన్నప్పుడుమట్టుకు అటువంటి ఇల్లొకటి కట్టి, బంగారం పారేస్తే బాగుండునూ అనిపిస్తుండేది. గృహనిర్మాణ విషయమై ఆయన చూపిస్తున్న జ్ఞానసంపత్తును గూర్చి మేము ఊహూ గర్వపడుతూ ఉండేవాళ్ళం.

వూళ్ళో ఎక్కడన్నా పునాదులు తీస్తున్నట్టుకనపడిందా అక్కడికి మేము తయారు. వెళ్ళి ఆ యజమానిని ఎంత కష్టపడిఅయినా సరే కలుసుకొని, "అయ్యా మీరు ఏదో ఇల్లు కట్టే ప్రయత్నంలో ఉన్నట్టున్నారు, శిరోమణిగారిని కలుసుకొని ప్రసంగించారా" అనటం, అతడు మేము భయపడ్డట్టుగానేలేదండీఅనేవాడు. అయ్యయ్యో, మీరు ఆయనతోసంప్రదించకుండా ఏప్రయత్నమూ చెయ్యకండీ. గృహనిర్మాణ విష

యంలో ఆయనసనిధి...అట్లాగా అని చెప్పేవాళ్ళం. ఆయనమ ర్నాడుశిరోమణివద్దకు వచ్చాడాసరేసరి. (మేముఅంతగాచెప్పి నా తెలివితక్కువ వెధవలు వచ్చేవాళ్ళుకారు) లేకపోతేశిరో మణినే అక్కడకి కొట్టుకెళ్ళి, ఆయన ఎదుట నుంచోబెట్టి, ఉప న్యాసం ఇప్పించేవాళ్ళం. అయితే వాళ్ళు తెల్లపోయివినేవాళ్ళు.

ఇట్లా, మనిషైనవాడు, ఎందుకు కడుతూఉన్నాడూ? తనకూ, తన కుటుంబానికి, నీడ కోసమున్నూ. తనఆస్తిని దొంగలు ఎత్తుకొని పోకుండా రక్షించుకోవటానికీనీ...అం దులో ఆస్తిరక్షణేముఖ్యమైనది కాబట్టి దొంగలూ, వాళ్ళు ఇండ్లల్లో ప్రవేశించటానికి అవలంబించే మార్గాలూ, వాళ్ళ పద్ధతులూ, రకరకాల దొంగతనాలూ ఇవన్నీ చదివితేకాని, ఆపద్ధతులు అన్నింటికి అలవికాని గృహనిర్మాణం ఇదమిద్ధం అని నిర్ణయించటానికి వీలులేదు. అందుచేత మనవాడు ఒక సంవత్సరంపాటు తత్ సంబంధమైన వాఙ్మయము అంతా గాలించి క్షుణ్ణంగా చదివాడు. అగ్నిభయమూ, చోరభయ మూ మొదలైనవి ఏమీలేకుండా చౌకలో ఇల్లు కట్టే పద్ధతి ఇప్పుడతనికి తెలిసింది.

ఇల్లుకట్టే పద్ధతి తెలిసేటప్పటికి డబ్బు చాలాభాగం అయిపోయింది. రెండు వందలు కామాలు అప్పటికిఉన్నాయి ఆ రెండువందలలో ఇల్లుకట్టటానికి చాలేటట్టు లేదు.

అయితే ఆఉన్న మొత్తానికి ఇంకో రెండువందలు అప్పు చేసి కలిపి, ఇల్లుకడితే ఆఅప్పు ఆఇల్లే తీర్చుకోదా అనీ, తాను

ఇగ్నాట్సా చదివి చదివి సంపాదించిన జ్ఞానంవల్ల, మూడు వందలలోనే ఇల్లుకట్టలేనా అనీ అతనికి తోచింది. కానీ... ఇప్పుడుఆ శాస్త్రా ఇల్లుకట్టడానికి వినియోగిస్తే, ఇకతనకుజన్మలో ఆశాస్త్రంలో పరిపూర్ణమైన జ్ఞానము సంపాదించటానికి అవకాశం ఉండదన్న మాట నిశ్చయం. అందుచేతా......

ఇంకా పుస్తకాలు కొని ఆ జ్ఞానాన్ని పూర్తిగాసంపాదించుకోవాలెననీ, ఇల్లుసంగతి దర్మిలా ఆలోచించుకోవచ్చుననీ అతనికితోచింది. అందుకని పుస్తకాలు కొని ఇంకా జ్ఞానాభివృద్ధి చేసుకొన్నాడు.

ఆ నెలలోనే "గృహనిర్మాణముదానిచారిత్ర్యము" అని ఒకచక్కని వ్యాసం వ్రాశాడు. అందులో సృష్ట్యాదిలో మానవుడు గుహలలో నివసించిన దగ్గరనుంచీ, మొదలుపెట్టి, ఏదోఒక ఆచ్ఛాదనకోసం మానవహృదయం ఎట్లా పరితాపం పొందిందీ చూపి గృహనిర్మాణాభిముఖంగా మానవప్రయత్నాలు, ఏయే దేశాలలో, దేశపరిస్థితుల ననుసరించి, ఏయే విధంగా పరిణామం పొందినవో చూపి, వర్తమాన కాలంలో గృహనిర్మాణం ఎట్టిమహత్తరమైన సృష్టివైచిత్ర్యంగా తయారైందో అగుపర్చాడు.

ఆ వ్యాసాన్ని మెచ్చుకోనివారు లేరు. చారిత్రక పరిశోధనమండలివారు కూడా శిరోమణిని అభినందించారు.

ద్రవ్యం లాభంమట్టుకు ఏమీ కలుగలేదు......

2

అక్కడనుంచి అతడు వివిధ పత్రికలకు ఈవిషయమై వ్యాసాలు పంపడం సాగించాడు. గ్రంథావలోకనంఎక్కువైంది. గృహనిర్మాణ విషయమై దొరకిన పుస్తకమల్లా చదివాడు.

గుంటూరులో ఉన్న వెయ్యిగజాల నివేశనస్థలం ఇక అతనికి అనవసరం అనిపించింది.

అదీగాక...గుంటూరు అతనికి ఇరుకైపోయింది. అంటే అతని విశాలదృష్టిలో గుంటూరు చాలా చిన్నఊరు అయింది. ఆస్థలం అమ్మివేస్తే, ఉన్నఅప్పులూ తీర్చుకోవచ్చు. రెండు మూడు వందలు చేతపట్టుకొని మద్రాసు వెళ్ళవచ్చునని తోచింది.

కొద్దిరోజులకే మద్రాసు చేరాడు.

మద్రాసు వెళ్ళిన తరువాత—..."మూడువందలలో ముచ్చటఅయిన యిల్లు." అనే వ్యాసం వ్రాశాడు. మూడు గదులూ, ఒక వంట ఇంటితోసహా, మూడు వందలతో ఒక ఇల్లు కట్టడం ఎల్లాగ సాధ్యమో చూపిస్తూ దానికి కావలసిన వస్తువులూ,వానిధరలూ,ఆలెక్కలూ,ఆప్లానులూ,సమస్తమూ తయారుజేసి వ్రాసి చూపాడు. దానితో అతనికి అద్భుతమైన పేరు వచ్చింది. గవర్నమెంటువారు శిరోమణిని వెంటనే ఆర్కిటెక్టుగా నియమించక పోవటం కేవలం అన్యాయం అనిపించింది. అతనిని అందరూ వేనోళ్ళ పొగిడారు.

అక్కడనుంచి అతనికి ఒకటే పిచ్చి. పుస్తకాలుకొనటం చదవటం, ఇప్పటికాల పరిస్థితులనూ దారిద్ర్యాన్ని పట్టి ఇళ్ళు చౌకగా ఎల్లాగు కట్టవచ్చునో, గవర్నమెంటువారు

తాము కట్టే భవనాలలో కొద్ది మార్పులుచేస్తే ఎన్నిలక్షలు ఆదా చెయ్యవచ్చునో మొదలైన విషయాలు ఎన్నో అతడు బయట పెడుతూంటే ఆంధ్రావని అట్టుడికినట్లు ఉడికిపోయింది. ఇట్టి విషయమైన జ్ఞానంలో శిరోమణి నిధి అయి పోయినాడు. కీర్తి వచ్చిందికానీ...

ఆర్థికంగామట్టుకు ఆతనికేమీ లాభించలేదు!! లాభించలేదని అతడు నిరుత్సాహమూ చెందలేదూ. గృహనిర్మాణంలోనుంచి, అతడు గృహ సౌందర్య విషయమై—"ది ఈస్తటిక్స్ఆఫ్ ది హోమ్"—తెలుసుకోనటం మొదలుపెట్టాడు. అదోఏడాది తీవ్రంగా చదివాడు. తరువాత పశ్చిమ దేశాలలో గృహనిర్మాణమూ, ప్రాగ్దేశాలలో గృహనిర్మాణమూ ఈరెంటికి గల సామరస్యమూ భేదమూ అంటూ మరొక వ్యాసం వ్రాశాడు.

గృహనిర్మాణాన్ని గురించి చదువుతూఉన్న రోజులలోనే ఆయనకు వాస్తుశాస్త్రంతో పరిచయం కలగటంసంభవించింది...అది క్షుణ్ణంగా చదివిన మీదట ఆయన మనస్సు జ్యోతిషంమీదికి పోయింది. ఇక అప్పటినుండీ ఆయనజ్యోతిషంమీద పట్టించాడు.

ఇంతకూ, ఆయన అప్పటికీ ఇప్పటికీ ఇల్లు కట్టలేదు. కాని ఇల్లు కట్టడాన్నిగురించి,ఆ శాస్త్రానికి సన్నిహితమైన వాస్తు జ్యోతిశ్శాస్త్రాలనుగురించీ శిరోమణికి తెలిసినంతగా ఇంక ఎవ్వరికీ తెలియదు.

ఇంతకూ ఎందుకు చెప్పానంటే ఇదంతా,......అదిగో ఆ చివరవాక్యం ఉందే, అప్పటికీ ఇప్పటికీ......అని. అదే ఆవాక్యమే మా ఇద్దరి జీవితాలనూ కలిపి కుట్టింది...అదే మా జీవితపథాలను కలుపుతూఉన్న అడ్డరోడ్డు. అదేమా జీవిత స్రవంతులను కలుపు వారావధి. మా జీవిత సంగీతానికి మేళకర్త...అదే ఆహతనాదం. మా జీవితవిపంచులు ఆవాక్యం స్ఫురించే అర్థంలో మాత్రం ఏకశ్రుతిని పొందినవి. ఒకే శ్రుతిలో ఉన్న వీణాతంత్రులలో ఒకదానిని కదిలిస్తే, రెండో తీగలోకూడా, అదేవిధంగా కదలిక కలిగినట్లు, అతని జీవిత విపంచిపై జన్మించిన నాదమే నా జీవితవిపంచిపై కూడా, సంవాది న్యాయానుగుణ్యంగా, మ్రోగింది. ఆవాక్యార్థంయొక్క అనుభూతియే మాయిరువురి జీవితాలలోను రసోద్దీపకమైన ఘట్టము. ఆవాక్య స్ఫురణలో ఉత్పత్తి అయిన నాదాలే మా ఇరువురి జీవాలలో ఆరోహణా క్రమణఊర్ధ్వముఖంగా బయలుదేరి మూలాధార స్వాధీనస్థాన, మణిపూరక అనాహతాదిచక్రపరంపరను దాటి తారస్థాయిలో మేళవించినై. అందుచేతనే ఆకథఅంతా చెప్పవలసి వచ్చింది.

౨

ఇక నా సంగతి:

నేనూఇల్లు కడదామని తీవ్రంగా ఆలోచించాను. ప్లానులుకూడా తయారు చేశాను. ఇంటికిముందువసారా, దక్షిణాన

పడక గదీ, పడమట వంటఇల్లూ, మధ్య హాలూ ఉండేటట్టు ఏర్పాటు చేశాను. మాఅమ్మాయి నాకోగది ప్రత్యేకంగా కావాలె నాన్నా అన్నది ఇదంతా గ్రహించి.

"నీకు గదిఎందుకే, రేపో ఎల్లుండో అత్తవారింటికి పోయేదానివి...దానికెందుకు నాన్నా నాకుమట్టుకుచదువు కొనేందుకు ప్రత్యేకంగా గది కావాలె నాన్నా" అన్నాడు మా అబ్బాయి.

"నీవుమట్టకు ఇక్కడ ఉండవచ్చావాఏమిటి? పెద్ద అయింతరవాత ఏవూళ్ళో ఉద్యోగం అవుతుందో! ఎక్కడ ఉంటావో? నీకు మట్టుకు గది ఎందుకురా" అన్నది ఆడపిల్ల.

"నాకు కావాలె...అదంతా నీకెందుకూ" అని మొగ పిల్లవాడు ఉరిమి చూశాడు.

"నీకు...అనవసరం...అంతవరకు నిజం. నాకంటే... బట్టలూ, సొమ్ములూఉంటాయి కాబట్టి ప్రత్యేకం గది కావాలెఅన్నది అది సహేతుకంగా మాట్లాడాలని ప్రయత్ని స్తున్నట్లు.

"నీకున్న—పెట్టెకూ, సొమ్ములకూనూ ఓ పెద్ద గది కూడానూ !! వెధవవి రెండు పెట్టెలున్నాయో లేవో !! అన్నాడు వీడు రొమ్ము విరుస్తూ.

"నీకు ఏడ్సినై లే—" అన్నది.

నీకు ఏడ్సినై, మాటలు సరిగ్గా రానీ అన్నాడు. వీడు ముక్కు పుటాలు ఎగరేస్తూ.

"వెధవగది నీవేతీసుకో—నా కొద్దులే—అని కళ్ళ నీళ్ళుగుక్కుతుంది ఆడపిల్ల.

"ఆ వెధవగది అంటావా?" అని లేచాడు. కోపంతో. నాకు వళ్ళుమండిపోయింది. వీళ్ళపోట్లాటచూస్తే.

"నోరు మూయండర్రా భడవల్లారా. ఆలూ లేదూ చూలూ లేదూ కొడుకుపేరు సోమలింగమన్నట్లుంది. ఇల్లుకట్టనూ లేదు పెట్టనూ లేదూ మీరు గదులకోసం పోట్లాటా!!" అని వాళ్ళ ఇద్దరినీ సద్ది పడుకోండి అని పంపించి ప్లానులు ముందేసుకొని, దక్షిణపు వేపు గోడకు రెండుకిటికీలు పెడితే బాగుంటుందా లేక దక్షిణాన ఒకటీ తూర్పున ఒకటీ పెడదామా అని ఆలోచిస్తూ కూర్చున్నాను. సింహద్వారంమట్టుకు తూర్పుకే పెట్టడానికి నిశ్చయించాను అయితే దక్షిణవేపు గదే పడకగది కావాలె. ఆగదిలో ఎనిమిదిమంచాలూ పట్టాలె ఎట్లాగా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాను.

ఇంతలోకే తొమ్మిది గంటలూ, ఠాంగ్, ఠాంగ్ న కొట్టటం ఏమిటి మా ఆవిడ ఘల్లుఘల్లున గుండుచెంబుతో మంచినీళ్ళుపట్టుకొని రావటం ఏమిటి, రెండూ ఒకసారే.

చిరునవ్వుతో మా కాంతాన్ని ఆహ్వానించాను.

ఏం మహా సరదాగా ఉన్నారు ఇవ్వాళ అన్నది. కనుబొమ్మలెగరేస్తూ.

రా. రా. ఇట్లాకూర్చో, చెప్పానుగాదూ నీకు ఇల్లు కట్టించాలని ప్రయత్నంచేస్తూన్నానని. అదే సంగతి. ప్లానులు

అన్నీ తయారు అయినై. దక్షిణపువైపున మన పడకగది రెండు కిటికీలుంటాయి. కావలసినంతగాలి. చూడు ఇక్కడా ... ...ఇల్లు ఇల్లాగ తూర్పుముఖంగా ఉంటుంది—పడక గదికి అవతల చిన్న తోట. అందులో గులాబీ, చామంతి, మల్లె, జాజి, గన్నేరు, రేరాణి మొదలైన పూలమొక్క లుంటాయి. ఆపూలపైనుంచి వచ్చే మంచిగాలి సరిగ్గా మన గదిలోకి వస్తుంది. రెండే గదులు... అందులో ఇదినేనుచదువు కొనేగది, నాకుర్చీలు, బల్లా, బీరువా ఇక్కడేపెట్టుకుంటాను. ఏం. అట్లాచూస్తావేం. అర్థంఅవుతున్నాదా ?

"ఇట్లా కాగితంమీాద చూస్తేనాకు చస్తే అర్థంగాదు ఇంతకూ స్థలం ఎక్కడ కొన్నారూ?"

"ఇంకా కొనలేదు. ఎంతలోకికొనాలె !"

"పోనీ డబ్బుఅయినా సిద్ధంగా ఉందా" అందిసూాతి విరుస్తూ ఒక కన్ను మూసి ఒక కన్ను తెరచి.

"ఈ వెధవప్రశ్నలు వేస్తావని నాకు తెలుసు. అందు కనే నీకు ఇన్నాళ్లబట్టీ చెప్పలేదు."

"అయితే ఇది వెధవప్రశ్నా? ? డబ్బులేకుండా ఇల్లు ఎల్లాగ కడతారండీ" అన్నది ఆమాత్రం నాకు తెలియద న్నట్లుచూస్తూ.

"డబ్బుకావాలే అనుకో" అన్నాను నేను దర్జాగా...

"అనుకోవటం ఏమిటి ? కావాలె—ఉందా?" అంది ఆవిడ వర్తకుడిలాగ కఠినంగా?

"ఉందా అంటేమరీ...రొక్కం గాలేదనుకో...
కానీ...కానీ..." అంటూ కళ్ళు తేలేస్తూ అట్లాగే కుర్చీలో కూర్చున్నాను కలంపుల్ల పళ్ళసందున బిగించికొరుకుతూ

"రొక్కంగా గాక...మరి నోట్లరూపంగానా అన్నది కాంతం వెటకారంగానవ్వుతూ.

అవునూ...నోట్లే...అంటే ప్రామిసరీనోట్లుమూల కంగా"అన్నాను హఠాత్తుగా ఏదో విధమైన సమాధానం చెప్పగలిగినానన్న సంతోషంతో. నిజానికి మొదట నేను ఇటు వంటి అసందర్భపు ప్రశ్నలు ఈవిడ వేస్తుందనుకోలేదు ఏదో నాలాగేఅందరిమోస్తరుగాసంతోషిస్తుందిఅనుకున్నానుగాని.

ప్రామిసరీనోటు అనేమాట వినేసరికి, ముఖం ఇంత జేసుకొని...అప్పుజేసి ఇల్లు కడతారూ? అన్నది. ఈమాటలుఎల్లాగ అన్నదో కాని నన్ను సాగదీసి లెంపకాయకొట్టినా, అంత బాధపెట్టేది కాదు. ఆమాటలు అంతకంటె బాధపెట్టినయి.

"అప్పుఅంటే...అప్పుగాదు. నీకెందుకూనీవుఊరుకో" అన్నాను విసుగ్గా ఏమీతోచక.

"అప్పుగాకపోవటంఏమిటి?'అన్నదికనుబొమ్మలుముడిచి.

"అప్పుగాక పోవటం ఏమిటంటే......బ్యాంకులో తెస్తాను" అన్నాను జయసూచకంగా నవ్వుతూ...

"బ్యాంకులో తెస్తేఅప్పుగాదా? అని అడుగుతుందని నాకు తెలునూ. అడగనూ అడిగింది."

అప్పే ననుకో. అయితేమట్టుకు అదివేరు. ఆకట్టిన

ఇల్లు అద్దెకుఇస్తే నాలుగేండ్లలో దాని అప్పు అదే తీర్చుకుంటుంది'' అన్నాను నేను. నిజానికికూడా నా ఊహ అదే.

ఈ ఊహ ఆవిడకు నచ్చలేదు. ''మనం అద్దెకొంపలో నానాఅవస్థా పడుతూ, కొత్తగా కట్టిన ఇల్లు అద్దెకివ్వటమా? మహా బాగుంది మీ ప్లాను'' అని నీరసంగా మాట్లాడింది.

ఆడదానితో కాస్త రాజీకివస్తే మంచిది. అందుకని ''పోనీ నీ మాట ఎందుకు కొట్టెయ్యాలె. మనమే ఆ ఇంట్లో ఉండి, అద్దె ఇస్తున్నట్లుగానే నెలకు పదిరూపాయలు ఇస్తూ అప్పుతీరుద్దాం.'' అన్నాను కొంచెం దారికి వస్తున్నదీ అన్న సంతోషంకూడా కలిగింది.

''అయ్యో!! అయ్యో!! మీరే అప్పుతీర్చేది! ఇల్లు మీరుకట్టనూ, నేను కాపరం ఉండనూనా!'' అన్నది రాగాలు తీస్తూ.

''నేను కట్టలేనా ?'' అన్నాను మూతి బిగించి.

''కట్టారె!'' అన్నది ఆవిడ చెయ్యిచాచి నేలవైపు తాకహస్తాన్ని చూపుతూ.

''ఏం. అట్లా అంటావు? నేనేం కట్టలేననా ?'' అని అన్నాను మీసం మెలేస్తూ.

ఇక అందుకుంది ఒక ఉపన్యాసానికి ''కట్టలేకేం! పెద్ద పిల్ల పెండ్లికి అయిన అప్పు...ఇంతవరకూ...దమ్మిడీ తీరలేదూ...ఏదో కరతారట...కరటం'' అంటూ మళ్ళీ అరిచేతులుఅధోముఖంగా ఛూపటం విదలించటం సాగించింది.

నాకూ వళ్ళుమండింది.

3

## 3

ఏం, అంత నిరసనగా మాట్లాడుతున్నావ్? నాకంటె ఎక్కువ సంపాదిస్తున్నారా మీవాళ్ళు? మీనాన్న ఎక్కువ వాడా? మీతమ్ముడు నాకంటే పొడిచేశాడా? అందరిప్రయోజకత్వం తెలుసు!'' అన్నాను నేనుతలపంకిస్తూ, చేతులుఊపుతూ

''మా నాన్నకేం. ఆయన రెండుఇండ్లుకట్టించాడు. ఆయనను ఎక్కిరించవచ్చారూ'' అన్నది ఆవిడ. వాళ్ళనాన్న గొప్ప గొప్ప సాహసకృత్యాలన్నీ చేసినట్లూ, అవి నేను కృతజ్ఞతతో జ్ఞాపకం ఉంచుకోక మహాపరాధం చేసినట్లూ, చూపులతో చెపుతూ.

''అవును. ఏం లాభం, ఆ రెండుఇళ్ళూ అమ్మాడు మళ్ళీనీ...వీలైతే పొరుగిల్లుకూడా అమ్మేవాడు. చెప్పొచ్చావు ఆయనప్రయోజకత్వం.'' అన్నాను నేను ముక్కుతూ.

''మీరూ అమ్మరాదూ చల్లపల్లివారి కేకినీమహల్''

''ఇక చాలించు''

''మరి మావాళ్ళమాట ఎత్తకండి.''

''మరి నేను ఇల్లు కట్టలేననబోకు.''

కట్టలేని స్థితిలో ఉన్నారు కాబట్టి కట్టలేరు అన్నాను తప్పా!''

కట్టగలిగిన స్థితిలో మీతమ్ముడుఉన్నాడా?''

''మళ్ళీ వాడిమాట ఎందుకూ''

"నామాట ఎందుకూ?"

"మీమాట నాకు కావాలె"

"వాడిమాట నాకూ కావాలె"

"మొండి వాదన తలా లేదు. తోకా లేదూ!"

"మొండివాదన నాదా నీదా?"

"మొండివాదన కాక ఏమిటండీ ఇదీ! చేతులో దమ్మిడీ లేదాయె, ఊళ్ళో మూడు నాలుగు వందల అప్పులాయె, మరి మీ మాటలు చూస్తుంటే కోటలు దాటుతూ ఉండె! అదేమంటే...కోపాలూ తాపాలూ, వెనకటికి ఒకడూ......ఎందుకులెండి, మీకు సరసం తెలియదు. మాట్లాడితే మూతి విరుపులూ ముక్కు విరుపులూనూ.

"అదేమిటి అల్లా అయితే ఎందుకు మొదలుపెట్టావూ సరసమో విరసమో అనేసెయ్యి అనదల్చుకున్నది."

"కోపమేమో?"

"చెప్పకపోతే మట్టుకు కోపంగాదా?"

"మరేమి లేదు లెండి. వెనకటికి మీమోస్తరాయనే ఒకాయన........"

"ఆహా—ఏమిటా విరగబడి నవ్వటం—చెప్పి మరీనవ్వు"

"ఒకాయన అన్నాట్టా...తమలపాకులూ ఇన్ని ఏవెధవైనా ఇస్తేబాగుండూ. వక్కలకు ఏం భాగ్యం ఎవర్ని అడిగినా, రెండు ఇస్తారు. సున్నం గోడకు గిల్లిరాచుకోవచ్చూ, అనీ'

అంటే నేనంత లేనిస్థితిలో ఉన్నానా!"

"మరి ఏముంది చెప్పండి ఇల్లు కట్టడానికీ..."

"ఏమీలేనివాడికి అప్పు ఎల్లాగ పుడుతుందీ? పోనీ అప్పుపుట్టించే శక్తిఅయినా ఉందీ అంటావా!" అన్నాను నేనుకనుబొమ్మ లెగరేస్తూ.

"మన నిజస్థితి తెలిస్తే అదీ పుట్టదు" అన్నది ఆవిడ ఇక ఆ జవాబుకు తిరుగులేనట్టు.

"మీవాడికి ఇస్తున్నారు కాబోలు వేలకు వేలూ!!" అన్నాను.

"మాతమ్ముడికి ఒకరిదగ్గరకు వెళ్ళవలసినఅవసరం లేదు. వాడికేం కర్మం. మహారాజుబిడ్డ" అంది ఆవిడ గర్వంగా.

ఇట్లా మా ఆవిడ అసందర్భపు ప్రశ్నలన్నీ వేసినా ఆర్థికపరిస్థితిని గూర్చి నిరసనగా మాట్లాడటం చూస్తే నాకు ఎట్లాగుందీ? నాద ప్రపంచంలో, యమముఖోద్భవములైన రెండుశ్రుతులలో తుదిశ్రుతి క్షోభిణియందు విషాదస్వరముతో ఐక్యం పొందుతున్నట్లుంది. అంటే వళ్ళు మండిపోతున్నదన్న మాట. అందుకని చివరకు విసుగుతో "అయితే నేనేనా దరిద్రుడ్ని మీతమ్ముడు మహారాజుబిడ్డ అయితే!" అని అన్నాను.

"నేను అన్నానా ఏమిటి? అన్నీ మీరే అనుకొంటు న్నారు" అన్నది ఆవిడజవాబుగా.

"అనకపోతేమట్టుకూ, ఏమిటీ మాటలూ!! శుభమా అంటూ ఇల్లు కట్టుకొందా మనుకొంటూ ఉంటే." అన్నాను ముఖం చిట్లించి కోపంగా.

కోపం వచ్చిందని గ్రహించింది కాంతం...గ్రహించి... తగ్గింది. తగ్గి,

"కట్టండి మీ కోదణ్ణం. సరేనా. కట్టండి ఇల్లూ. అప్పు జేయండి!"

అప్పుజేసే కడతానో, ఆదాచేసే కడతానో, అయిన మగవాళ్ళు ఏం జేస్తారో నీకెందుకూ! ప్రతిదీని నాకు కావాలని వస్తావ్. ఇక ఊరుకో" అన్నాను కోపంగా.

నేను ఏమన్నా అంటే ఒట్టు. రేపే కట్టండి.అన్నది" రేపే అన్నమాట నొక్కి-నొక్కి అంటూ.

"కడతాను చూస్తుండు, రేపే కడతానో లేకపోతే ఇంకానాలుగేండ్లకే కడతానో తీరిగ్గా." అన్నాను నిర్లక్ష్యం గానీ లెక్కేమిటి అన్నట్లు.

"మీ ఇష్టం అంటినిగా...ఇక నన్ను వాగించకండి. పెద్దపోట్లాట అవుతుంది. ఇంతటితో పోనీయండి రికామిగా అన్నమాటలో ప్రతిఅక్షరాన్ని సాగదీస్తూ.

నేను ప్రతి అక్షరాన్ని సాగదీస్తూనే జవాబు చెప్పాను "సకామీగానే...కడతాను. నీ సలహా ఏమిటి ... నాకు నీమాటలు వింటూంటే మంటెత్తుతుంది. మనిషియందూ... ఒక్క పిసరుఅన్నా...గౌరవం లేదాయె... యెంతచెప్పినా మనిషియందు నమ్మకం లేదాయె! ఇంతకూ నీకు స్వంతఇల్లు ఉండే ప్రాప్తం ఉన్నట్లు లేదు. [illegible]

ఊహూ—అటు తిరుగు,



# ది పర్ ఫెక్ట్ వైఫ్

"ఏమిటండీ ఇవన్నీ" అన్నది మా ఆవిడ నేను తెచ్చిన ఆచిత్రపటాలన్నింటిని ఉద్దేశించి. "ఇన్ని బొమ్మల పుస్తకాలు ఎక్కడివండీ—అబ్బో ! అట్టలమీద అతికించారే కొన్ని"—అన్నది మళ్ళీ.

"తెచ్చాను నీకోసంచూడు ఎంచక్కని బొమ్మలో!!

"ఇవన్నీ కొన్నారా ఏమిటి కొంపతీసి".

"అఁహాఁ."

"ఆఁ – కొనే ఉంటారు. మిమ్ములను ఎవరో టోపీ వేశాడు. ఇవేం బొమ్మలండీ!"

"ఏం" ?

"సరే ఏం జెప్పేది. ఎందుకూ పనికిరానివన్నీ మీకు అంటగట్టినట్లున్నారు చూడండీ మీరు చూసే కొన్నారా ఇవన్నీ ? అయ్యయ్యో ! తలకు మాసినవాడు ఎవరండీమిమ్ములను అన్యాయం చేసిందీ ?

"చాల్లే – ఇక ఊరుకో. నీకు వాటిసంగతి ఏం తెలుసునని మాట్లాడుతున్నావు ? అవన్నీ గొప్పప్రసిద్ధులైన చిత్రకారులుగీసిన పటాలు. కొంటే... ఒక్కొక్కటి రెండువందల రూపాయల ఖరీదు ఉంటుంది. మన బాపిరాజుగారిని అడిగి

బ్రతిమిలాడి, ససేమిరా ఇయ్యనంటే వేధించి, ఇవన్నీ తెచ్చాను నీకు చూపిద్దామని.

ఇది ప్రఫుల్లచంద్ర ముఖర్జీ వ్రాసింది. ఆ స్త్రీ ఒక విరహిణి. వియోగం కలిగి ప్రియాగమనానికై నిరీక్షిస్తున్నది.

ప్రొద్దస్తమానమూ ఊరిమీదతిరిగి సాయంత్రానికి కొంపకుచేరేసరికి ప్రియురాలు, ఇల్లాగ భర్తనిరీక్షిస్తుంటే... ...ఎంతఆనందంగా వుంటుందో ఊహించు. నేను వచ్చేసరికి నీవు ఇల్లాగ ఉండరాదూ? ఇదేమంత కష్టమైనపని ఆయినా కాదు. తెల్లనిచీర కట్టుకొని, తలలో పూలు అర్ధచంద్రాకారంగా చుట్టుకొని. ఆ ఉన్నఆభరణాలు, గడియారం గొలుసో, కాచికాయగుండ్లో, మెళ్ళోవేసుకొని కళకళలాడుతోఉన్న ముఖంతో కనబడుతూ. నీగడ్డం పట్టుకొని బ్రతిమలాడుతున్నానూ.

అయితే ఆకనబడడం ఈ బొమ్మలో ఉన్నమాదిరిగా కనబడాలె. చూడు. ఈ ''నిరీక్షణము'' నీవుకూడా మంచి ఛాపపైన వయ్యారంగా ఈ పోజులోకూర్చో గడ్డంక్రింద చెయ్యిపెట్టుకొని మన గవాక్షంలోనుంచి చూస్తుండు.

''ఏం చూస్తుండమంటారు? వీధిలో వాళ్ళనా?''

''అదే తెలివితక్కువ. అప్పుడు నీచూపులు విచిత్రంగాఉండాలె. దగ్గరవున్న వస్తువులను చూస్తున్నట్లుఉండరాదు. దూరాన ఎక్కడో స్వప్నలోకంలో ఉన్న ఒక దివ్యదృశ్యాన్ని గమనిస్తున్నట్లుండి కళ్ళు నిమీలితంగా వుండాలె.

ఆకూర్చున్నపుడు నీ శరీరంకూడా చక్కని వంపులతో లావణ్యాన్ని వర్షిస్తూ నిరీక్షణభావానికి అనుగుణ్యంగా భవిష్యత్తులోనికి సాగినట్లు ఉండాలె. విన్నావా ?'' ''ఆహా వింటూనేఉన్నా బాగానే...ఉంది మీరు చెప్పింది''

అల్లాగే పిల్లలకు పాలుఇస్తున్నప్పుడు ఈ ''పట్టితల్లి'' అన్న బొమ్మలోమాదిరిగా మాతృత్వము మూర్తీభవించిన రూపులో, దృక్కులలో మాతృప్రేమ ఒలికిస్తూ కనబడాలె. తెలిసిందా !''

పిల్లలకు పాలీయటం తెలియదండీ నాకర్మంకాలిపోతే?' అని అంటూ తొలిగిపోయిన పమిటను సవరించుకొంది.

''పాలీయటం తెలియటం కాదు. ఆమాదిర భావాన్ని వ్యక్తపరుస్తూ కనపడటంలోఉంది అందమంతా'' అన్నాను. పళ్ళు బిగించి విసుక్కుంటూ.

''సరేలెండి. ఇదేమిటండీ. ఇందులో పిల్లతో తల్లీ ఉన్నారూ?'' అని అంటూ మా పసిదాన్ని దగ్గరకు తీసుకొని ముద్దాడింది.

''అది చాలాగొప్ప పిక్చర్. ప్రసిద్ధుడైన బెంగాలుచిత్రకారుడు దీనిని వ్రాశాడు. దీనికి''ది లైట్ ఆఫ్ ది హోమ్.'' అని పేరు. నీవు పిల్లలకు జెడవేసి బొట్లుపెడుతున్నపుడు ఈ చిత్రంలోని పద్ధతిని అనుకరించవలసి ఉంటుంది. చూడు. ఇందులో ఆమె ఎంతమనోహరంగాఉందో చుక్కల మధ్య చంద్రుడిలాగ ప్రకాశిస్తున్నది. !!''

"అయిదుగురుపిల్లల తల్లిని నే నింకేం ప్రకాశిస్తాను లెండి!" అన్నది. ఆవిడఅయిదుఅనేమాటనునొక్కి ఉచ్చరిస్తూ.

"అల్లా అనటానికి ఏమాత్రం వీల్లేదు. జహాంగీరుచక్రవర్తి బహుసంతానవతియైన తనభార్యను నూర్ మహల్ అని పిలిచాడు. ఏంఫరవాలేదు. నీవు ప్రయత్నిస్తే ఇట్లాగఉంటావు. కొంచెం శ్రద్ధ కావాలె అంతే."

"సరేలెండి ఈబొమ్మలన్నీ ఈమోస్తరేనా? ఇంకా ఏమన్నా మంచివి ఉన్నాయా ?"

"అంటే! ! ఈ బొమ్మలన్నీ మంచివికావనేనా నీ అభిప్రాయం ?"

"అందుకనే నాకు కోపంవచ్చేది. ఇప్పుడు నేను ఇవన్నీ మంచివి కావన్నానా ?

"పోనీ, పాపం, మీరు ఏదో ఉత్సాహంగా చెబుతున్నారు గదా అని తీరికగా కూర్చొని, శ్రద్ధగా వింటూన్నందుకా ఈ మాటలు ?"

"కాదులే విను. ఈ బొమ్మచూడు. ఇది రతీదేవిచిత్రము అద్భుతంగా ఉంది."

నిజమేనండి. ఈ బొమ్మమట్టుకు . చాలబాగుంది. ఆచేతులు సన్నగిల్లి వంకరపోయినై అన్నమాటే కాని."

"వంకరపోవటంకాదే పిచ్చిమొద్దూ. చేతులు అంత సన్నగా ఉండటం సౌందర్యానికి లక్షణం. చాలాబాగుంది ఈ బొమ్మ ఏమంటావు ?

4

"నాలుగూ పెట్టుకుంటే నేనూ అట్లాగే ఉంటా."

"ఉండమనే సాక్షోరిక. ఆచూపులు చూడూ. ఆయాకలి చూపులూ, ఆ సిగ్గు, ఆ నమ్రతా, ఆలావణ్యమూ. అంతా అద్భుతంగాఉంది. శయ్యామందిరంలోకి వచ్చినపుడు నీవు కూడా ఇటువంటి భావాలను వ్యక్తపరిస్తే సజీవమైనచిత్రాన్ని జూచి నేను ధన్యుడ్ని అవుతాను." అన్నాను. నేను కళ్ళు తేలేసి గుటకలు మింగుతూ.

"అయితే మనకు శయ్యామందిరం ఏదీ ?"

"అవ్వే, కుంటిప్రశ్నలు. అందంఅంతా ఆచూపులలోనూఆభావప్రకటనలోనూ ఉందిగాని, శయ్యామందిరంలో ఉందా ఏమిటి ?"

"సరేలెండి – ఇంకా చాలా బొమ్మలున్నయ్యే." అనిఅంటూ ఆవలించి రెండుచిటికలు వేసింది ఆవిడ.

"ఈ బొమ్మలన్నీ నీవు జాగ్రత్తగా పరీక్షించు, మాట్లాడేటప్పుడు, పడుకున్నపుడు, కూర్చున్నపుడు ఎట్లాఉంటే అందమో, ఆవంపులు, ఆ హస్తవిన్యాసాలూ, ఆభంగిమలూ అవన్నీ చూపిస్తూఉన్న అజంతాచిత్రాలు తెచ్చాను. నిలుచున్నపుడు సాధారణంగా ఇట్లానిలుచుంటే అందము."

ఇట్లాగా, ఇట్లాకడుపులో నొప్పితో బాధపడుతున్నట్లు గానా,"

"పిచ్చిమొద్దువునీకేం తెలుస్తుంది? అదిఅద్భుతమైనపోజు ఆ భంగిమాన్ని త్రిభంగి అంటారు. మాట్లాడేటప్పుడు ఇల్లా

చెయ్యి ఎత్తిచూపాలె. ఈహాస్త్రాన్ని మృగశీర్షికమంటారు. ఎందుకు ? ఎట్లు ? అన్న ప్రశ్నలకు ఈహా స్తము ప్రసిద్ధం''

''అయితే...నాకూ తెలియక అడుగుతాను...ఎందుకండీ, ఇవన్నీ ? మనం మామూలుగా నిలచునట్లునిలచుంటే ఏమి?''

అంతా విని, మళ్ళీ ఆప్రశ్న వేశావు? మామూలుపద్ధతిలోఅందంలేదు.''

''ఇందులో......?''

''గొప్పఅందము, లావణ్యము ఉంది.''

''ఓహో తెలియకే అడిగాను లెండి!''

''చెప్తున్నాగా విను. పోని నన్ను సంతోషపెట్టడానికైనా ఇట్లాచెయ్యి.''

''చేస్తానులెండి !

''చేశావానేను అదృష్టవంతుడినే! నాయిల్లు ఒక చిత్రశాల అవుతుంది. తప్పకుండా అవుతుంది. !సజీవచిత్రములతో కూడిన చిత్రశాల అవుతుంది !! తప్పకుండా అవుతుంది. ఈచిత్రాలను అనుకరిస్తావా?''

''అనుసరిస్తానులెండి పోనీ మీకంత సరదాగాఉంటే. అయితేమీతో మాట్లాడుతున్నపుడుమాత్రమే. ఇంకెవరితోనైనా మాట్లాడుతున్నపుడుమట్టుకు ఈ చిలిపిచేష్టలు నేను చెయ్యనుసుమండీ.''

కాంతం నాఅభిలాషలన్నీ విని ఆమోదించినట్లు కనపడి, సాధ్యమైనంతవరకు ప్రయత్నిస్తాననికూడా వాచా అన్నది.

ఇంకేంకావాలె నాకు? నేను పరమానందభరితుడ్ని అయినాను.

అంతేకాదు. నికరంగా, పూర్తిగా, అమందానందకందళితహృదయారవిందుడ్ని అయినాను. అతిశయోక్తి ఇందులోఏమీలేదు. అంతపనీ జరిగింది.

అమిత సంతోషం గలిగి, ఆవిడ ఘనుందని వంటయింట్లోకివెడితే, వెంబబడి వెళ్ళి అన్నంపెట్టేటప్పుడు "ది యంగ్ హోస్టెస్" బొమ్మను అనుకరించమనీ మాట్లాడుతూ నిలచున్నపుడు "దిపర్ఫెక్ట్ వైఫ్" బొమ్మనూ అనుకరించమనీ చెప్పి ఇరవై నాలుగు హస్తజాతులూ, ముద్రావిశేషాలూ ఆవిడకు చూపించాను. వివిధాలంకారాలతో అలంకరించుకొని భర్తనుసంతోషపెట్టడమే పరమావధిగా నిర్మించుకొనటం సనాతన మతధర్మసమ్మతమని, కామసూత్రాలు అచ్చుపుస్తకం కాంతానికి చూపి, ఎంతో నచ్చ జెప్పాను.

ఆ మరునాడే నేజెప్పినవిషయాలు ఆ చరణంలో పెట్టబడటానికి నిర్ణీతమైంది. కాంతంకూడా సమ్మతించింది.

సాయంత్రం ఇంటికి వస్తూన్నాను...

ఈపాటికి కాంతం ఏ పోజులో వుంటుందాఅనిసందేహం కలిగింది. తప్పకుండా నిరీక్షణలో ఉండవచ్చునని తోచింది. ఆసాయంత్రం చాలా రమణీయంగాకూడా ఉంది. అల్లా అనుకొని ఉవ్విళ్ళూరిపోయినాను. గుటకలుమింగాను. కళ్ళు తేలేసి,

భావనా కాశాంతర్భాగాన, ఒక దివ్యదృశ్యాన్ని మనశ్చక్షువుతో చూడగలిగాను. స్వర్గానికి పోతూన్న జీవివలె సంతోషంతో తూలిపోయినాను. తనువు పుల్కరించింది. తేలికమై, మేఘపుతునకలాగా గాలిలో తేలుపోతూ ఇంటికి వచ్చాను.

తలుపు వేసివుంది ! ! !

కిటికీలో నుంచిచూశాను దడదడ కొట్టుకుంటోన్న గుండెతో.

"లేదు...ఆమె గవాక్షంపక్క లేదు........ నిరీక్షిస్తూ లేదు ! ! "

పోనీ, యింట్లో పిల్లలమధ్య చక్కనిచుక్కలాగ కూర్చుని "దిలైట్ ఆ ఫ్ది హోమ్" పద్ధతిలో ఉందా.

లేదు మహాప్రభూ, లేదు ! ! !

రతీదేవిలాగ ఉండవలసిన సమయం కాదది.

ఇంక మరి ఏపద్ధతిలో ఉందీ ?

ఏం జెప్పేది ! ఆవిడపద్ధతి ఆవిడదే నిలువునా నీరైపోయినాను తెప్పరిల్లి,

తెల్లచీరైనా కట్టుకోలేదేం ?" అన్నాను ఆర్చుకుపోయిన పెదవులను నాలికతో తడిజేస్తూ.

"బోగందాన్నిటండీ, ప్రొద్దుగూకేసరికి చీర సింగారించుకొని వీధిలో నిలవటానికి ? అన్నది, అదేదో ఒకరకం స్వరంలో. అది ఏమిస్వరమోగాని నాహృదయంలో మాత్రం తకిట ధోం – ధోం. – తకిట – కిట – ధోం. ధధికిట –తకిట –ధోం తకిట –ధోం అని మృదంగనినాదం బయలుదేరింది."

---

"అయితే నేనూ...నీకూ...చెప్పిబోధించిన ప... ప...పద్ధతులలో...ఇపుడు నీవుఏపద్ధతిలో ఉన్నట్లు"అన్నాను గుండెలమీద చెయ్యి అదిమిపెట్టి."

"ఏ పద్ధతి ఏమి టండీ-మన పద్ధతే! మీదంతా అదో విచిత్రమూ" అన్నది. ఆవిడ నా ఆదుర్దాను అంతా ఉదాసీన భావంతో తోసేసింది.

కాసేపుఅట్లాగే నిలబడ్డాను. నోటమాటా లేదు. కంట చూపూ లేదు.

ఆలోచనా ధూమ సముద్రంలో ఊపిరాడక క్షణంసేపు కొట్టుకొని తెప్పరిల్లి.

"చక్కగా అలంకరించుకోనైనా లేదేం" అన్నాను

"ఏమి అలంకరించుకోనేది ? మీరు పెట్టిన ఏడువారాలసొమ్ములున్నాయి గనుకనా ? అట్లా దొడ్లోకి రండీ-మాట్లాడుకుందాం సరదాగా. చెయ్యిఊరుకోలేదు." అన్నది.

నేను పడుతున్న అవస్థ ఆమెకు ఈషణ్మాత్రంకూడా తెలిసినట్లు కనపడ లేదు. లేక తెలిసికూడా నాఅవస్థను ఉన్మాదవిశేషం క్రింద జమకట్టి, సౌందర్యాన్నిగురించినాకు గల భావాలను తృణీకరిస్తూన్న దేమోనాకు తెలియదు. పైగా దొడ్లోకి వెళ్ళి సరదాగా మాట్లాడాలట !

కూలబడిపోయినాను కుర్చీలో నారాయణ స్మరణ చేస్తూ. "ఇప్పుడేం చేయాలి" అన్నది పెద్ద ? అయిపోయింది. ఆలోచించాలనిప్రయత్నించాను. కాని అదేమిచిత్రమో కాని

నాతల మొద్దుపారి, గ్రీకుకథలలో చెప్పినట్లుగా, ఇనుపముద్ద అయిపోయింది.

అరగంట గడచిన తరువాత మెల్లగా, జలాశయంలో చిరుగాలికి జన్మించేఅలలలాగ, రెండుమూడు ఆలోచనలు తట్టినవి.

మొదటిది ఆమెనుకోప్పడితే లాభంలేదన్న విషయం. కోపపడి సాధించే విషయంకాదు ఇది.

రెండవ ఆలోచన, ఆమెను బ్రతిమిలాడితే ఏమన్నా లాభం ఉంటుందాఅన్నసందేహం. ఇదివరలో నేను బ్రతిమి లాడగలిగినంత బ్రతిమిలాడాను. ఇంక అటువంటి పనివలన ప్రయోజనంలేదని తోచింది.

కుర్చీలోనుంచి లేచి దొడ్లోకి వెళ్ళి—ఆమెవంక తేరిపార జూచి, పొంగివస్తున్నదుఃఖాన్ని ఆపుకోని "ఆజుట్టుముడి ఏమిటి ? అల్లాఉన్నది!?" అన్నాను. వేణిబంధాలను చిత్ర విచిత్ర రీతులలో చూపిస్తున్న ఒకటి కృష్ణా పత్రికలో ప్రచు రించారు. దాన్ని సంపాదించి ఆవిడకు ఇచ్చాను. అందులో చూపెట్టిన పద్ధతులలో వేణీబంధాలను సవరించుకోమని ఇది వరలో చాలాకాలాన్నుంచి చెపుతూవున్నాను.

"దీనికేం ఇది బాగుండలేదా" అన్నది తన జడచుట్టు నుముద్దుబిడ్డను నిమురుతున్నట్లు నిమురుతూ ......ఇంకేం అనేది? కూలింది హిమాలయపర్వతం కూలింది. దభేలున కూలింది!!

నేనో.........?

మూలాన, జన్మించిన తాపంతో, కుంగి కృశించిపోతూ, భోజనం పూర్తిచేశాను.

నా గదిలోనికి వెళ్ళాను. అదే నేను చదువుకొనేగది. అదే నాపడకగది కూడాను. రతీదేవి బొమ్మముందుంచుకొని, అందున్న సౌందర్యాన్ని చూచి ముగ్ధుడ నైపోతూ, ఆ బొమ్మవ్యక్త పరుస్తున్న భావాలనూఊహిస్తూ, సౌందర్యాన్ని ఉపాసిస్తూ కూర్చున్నాను. ఎంతసేపు అల్లా కూర్చున్నానో తెలియలేదు.

చివరకు మా ఆవిడ రాక నాధ్యానానికి భంగం కలిగించింది. ముక్కుతీరులోగాని, పెదవులకుదిరకలోగాని, కళ్ళ సౌందర్యంలో గాని మా కాంతంలో లోటు నాకు ఏమీ కనిపించలేదు, వస్త్రధారణలో కొంచెం శ్రద్ధ, చూపులలో రవ్వంత తీవ్రత ఉండి, ఆమె హృదయాంతర్భాగంలో ఉన్న భావాలు ప్రతి అవయవము వ్యక్తపరిచేటట్లు చేస్తే, ఆమె పూర్తిగా రతీదేవి అయిపోను.

నాకోరిక మన్నించదాయె. నా ఆందోళన అర్థంచేసుకోదాయె జుట్టుముడియైనా మార్చదాయె.

మంచినీళ్ళ చెంబు బల్లపైన పెట్టినా ఖల్లకు ఆ కొసను, కుర్చీలో కూర్చున్నది కాంతం.

నేను ఆమెవంక ఒక్కనిమిషం చూచి ఒక్కనిట్టూర్పు విడిచి, మళ్ళీ రతీదేవి చిత్రాన్ని చూస్తూ తలవంచుకున్నాను

నేను చెప్పినట్లు ఆమెచేసింది కాదని నాకు కోపంగా ఉన్న మాట నిజమే.

ఆమె మెల్లగా అద్దం ముందుకు వెళ్ళి తనజుట్టుముడిని విప్పి మరొక రకంగా సవరించి, పైన చక్కని చామంతి పూలదండ అర్థచంద్రాకారంగా చుట్టింది. నేను ఇది గమనించి, నవ్వాను. ఆమెకూడానవ్వింది. నేను ఆమె ముఖం చూడకుండానూ ఆమె నాముఖం చూడకుండానూ, ఈ బేరం జరిగిపోయింది. ఆ అద్దం మా ఇద్దరిమధ్య రాయబారం జరిపి రాజీ కుదిర్చింది...

"అయితే నా మాట వినదల్చుకో లేదన్నమాట" అన్నాను. ఆవిడను ఎట్లాగైనా నా కోరికను అనుసరించి ప్రవర్తించేలాగున చేద్దామన్న ఆశతో.

"మీమాట వినకపోతే ఎవరిమాట వింటానండీ? వినక ఏంచేశాను. చెప్పండి ! అన్నది. నమ్రతతో - సంతోషించాను—

"అయితే, ఈ బొమ్మను అనుకరించలేదేం" అన్నాను. రతీదేవి చిత్రాన్ని చూపిస్తూ.

"అనుకరించాలసిన అవసరంలేదు. నేను అసలు రతీదేవి లాగనే ఉన్నాను. అంతకంటేకూడా కొంచెం బాగానే ఉన్నానేమో ! అన్నది చిరునవ్వున్న మృదువైన మాటతో కప్పిపెట్టి.

"ఆకారంలో రతీదేవిలాగ నీవు వున్నావు అని నేనుఎట్లా ఊహించుకో గలను? ఉందిలోపంనీలో ఆ లోపం...నీచూపులలో తీవ్రతవల్లా, చక్కనిపోజు ఇచ్చి పోగొట్టుకోరాదూ?'

మీరేం పోజు ఇచ్చారు! మీరు, ఏం, హస్తాలుపట్టారు? మీరు ఏ చిత్రాన్ని అనుకరిస్తున్నారు? అంటే కోపం గాని, ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పండి?

....................

మీరు ఇంటికి రావటంలోనే, రాజువెడలెను అనేపద్ధతిలో హాలులో కాసేపు ఎగిరి దొడ్డోకి రండి. దానితరువాత "ది ఫర్ ఫెక్టు హజ్ బెండ్" అనే బొమ్మను అనుకరిస్తూ నిలచోండి. సింహాతరాటహస్తం పట్టండి—మీరు అట్లాగ చెయ్యండి. నేనో మీరు చెప్పినట్లు చేస్తాను............

.........................................................

అదేమిటండీ అల్లాగ తెల్లపోయి చూస్తున్నారు. హస్తాలుమిమ్ములను పట్టమన్నానా?

............................

అయితే ఒకటి. ఏమిచెయ్యకపోయినా, నాకళ్ళకు మీరుమన్మధుడిలాగ కనబడుతున్నారు. అన్నది ఆవిడ నామెడపైన తనచేతులు వేసి బ్రహ్మాండమైన అర్థాన్ని ఈ మెత్తనిమాటలలో మాటు పెట్టింది.

నేను నీకు మన్మధుడిలాగ కనబడుతున్నానూ? అన్నాను నేనూ, దురదపుట్టిన మణికట్టును గడ్డానికేసి రాస్తూ.

"ఎందుకు కాదూ? తప్పకుండా కనపడుతున్నారు"— అన్నది.

"ఎందుకు అంటావు అల్లాగ? నాకింకా తెలివితేటలు పోలేదు. ఈపొగడటాలు నన్నేమి సంతోషపెట్టవు. తెలుసునా!" అన్నాను గంభీరంగా. అద్దందగ్గరికి వెళ్ళి లెవెండరుతో తల తుడుచుకొని దువ్వెన్నతో పాపట తీసుకొని, సాధ్యమైనంత అందంగా దువ్వుకొంటూ, ఆవిడ నా వంకచూస్తూ, నా చేష్టలను గమనిస్తూ కొంచెంసేపు నిలబడ్డది. చప్పునవచ్చి నా చేతులోని దువ్వెన లాక్కొని నేను తీసుకొన్న పాపిట చెడిపి ఒకచేత్తో దువ్వెన పట్టుకొని చక్కగా పాపట తీర్చి మళ్ళా దువ్వెన నాచేతి కిచ్చేసింది నవ్వుతూ.

నేనూ వెనకా ముందూ చక్కగా దువ్వుకొని, చేత్తో సర్దుకొని, మళ్ళీ దువ్వుకొని, మా కాంతం వంక చూశాను.

"నేనన్నమాట అబద్ధమనీ ఇప్పటికీ అంటావా" అన్నది మెరుస్తున్న కళ్ళతో ఏదో ఒక కొత్తవస్తువును చూస్తున్నదానిలాగ నావంక చూస్తూ.

"ఆఁ, నీవన్నది నట్టిమాట. ఇవన్నీ బొల్లికబుర్లనాకం తమాత్రం తెలియదనుకొన్నావా" అని గర్జించాను. ముఖానికి హేజలైన్ స్నో కొద్దిగా రాచి అరచేతులతో ముఖాన్ని కలయరుద్దుకొంటూ "ఉన్నారండీ! మీరు నవమన్మధుడిలాగ ఉన్నారంటే నమ్మరేం!—నా కళ్లకు అట్లాగే కనపడుతున్నారు." అన్నది ఆవిడ జవ్వాజి కొంచెం తీసి మెడక్రిందా, వక్షస్థలానికీ, పులుముకుంటూ.

నేను అప్పటికి ధోవతిమార్చి, పెట్టెలోనుంచి షర్టు కూడాతీసుకొని వేసుకొన్నాను. తళతళలాడే బంగారపుగుండీలు పెట్టుకొని కొద్దిగా వాసననూనె మీసాలకు పూసి దువ్వుతున్నాను మెఱుగుకోసం.

"అయితే నేను రతీదేవిలాగ లేనుటండీ" అంటూ ఆవిడ కూడా అద్దం దగ్గరకు వచ్చింది.

ఏం జెప్పాలెః.

మధ్యవర్తిని అడగాలె, ఏంతగాదా అయినా పరిష్కారంకావాలంటే—

ఇద్దరం ఒకరి పక్కన ఒకరు నిలచుని అద్దాన్ని తీర్పు జెప్ప మన్నాము. క్షణం పట్టింది తీర్పువినటానికి.

"గిరుక్కున కాంతంవైపు తిరిగి, "వున్నావు, నిజంగా రతీదేవిలాగ ఉన్నావు." అన్నా నేను. నేను ఆవిడమెత్తని బుజాలపైన చేతులు వేశాను. ఆమె నామూంజేతి గుండీలను సవరిస్తూ నిలబడి పోయింది.

ప్రొద్దున తొమ్మిదిగంటలకల్లా నేను భోజనంచేసి, జట్కాను పిలిచి, అందులో పుస్తకాలు పడేశాను. ఇకఎక్కబోతున్నాను.

"చూడండీ. అమ్మాయి తెస్తున్నది. దబ్బున అందు కోండి ఆబొమ్మలు. ఖరీదుగల బొమ్మలుకాముాలు. మనకు లాభం కాని పనులు మనం చెయ్యకూడదు కానీ... —అవన్నితీ

సికెళ్ళి ఆయన కిచ్చేసెయ్యండి." అని చెప్పి పిల్లను గడపఅవతలకు లాక్కుని తలుపు వేసుకొంది.

"పోనియ్యవోయి బండి —"అన్నాను.

ఎత్తు పల్లాలు గలిగి, దుమ్ముతోనుండి, మేకుల్లాగ, కాళ్ళలో దిగబడే కంకర రాళ్ళు వున్నటువంటి ఆరోడ్డుపైన, బండినడుస్తూ కటకట శబ్దం చేస్తూఉన్నా ఆ జీవితానికే అలవాటుపడి, అందులోనే ఆనందాన్ని అనుభవించటం నేర్చుకొన్న ఆ గుర్రం మహా హుషారుగా, ఎగురుతూ, సకిలిస్తూ తన యజమాని వేసే ఈలలకు పరవశత్వం పొందుతూ,పరుగెత్తింది.

ఆపిల్లనూ, ఈపిల్లనూ, కేకలు వేస్తున్నది. తీరంటా నేను భోజనంచేసి బట్టలు వేసుకొని ఏదీ పెట్టె-అని అంటే అప్పుడూ కావిడిపెట్టెలోనుంచి ధోవతి తీసిఇది కావాలా అని అడగటం.

"నీకు బుద్ధి ఉందా లేదా? అవసరంగా బండికి పోవాలని నెత్తిని నోరు పెట్టుకొని అరుస్తుంటేనీకు చీమ కుట్టినట్టు అయినాలేదు. ఇప్పుడు బట్టలు తీసి అది కావాలా ఇది కావాలాఅని అడుగుతావ్రా? ఈవెధవ నిర్లక్ష్యం దేహశుద్ధితో గాని అణగదు."

నేనింత గట్టిగా తిడుతున్నా, ఆవిడ కదలకుండా ఆధోవతిని అల్లాగే పైకెత్తి పట్టుకొని నాకు కోపంవచ్చిందనిభయం గాని విచారం గాని లేని గొంతుకతో– ఇంతకూ ఇది సూట్ కేసులో వెయ్యనా వద్దా చెప్పండి అంటుంది.

నాకోపానికి భయపడలేదు. నన్ను విసుగెత్తించినందుకువిచారపడలేదు. అందుకని నేను కొరకొరా చూసాను. అచూపుకు జవాబుగా నేను బ్రతికున్నన్నాళ్ళు మీకీ కోపం పోదు లెండి అనడం.

నాకుఈఅన్యాయం భరించరానిదని అనిపించింది. ప్రొద్దునచెప్పినపని సాయంత్రంవరకూ చేయకపోవడం. నేనువచ్చిన తరువాత అయినా పశ్చాత్తాపపడి చేసిందా అదీలేదూ! నేను విసుక్కుంటే గడ్డిపరక కింద లెక్కేసి ప్రవర్తించి, కోపపడితే నిర్లక్ష్యంగాచూసి, పైగా ఈ కోపంనాకు అలవాటైనట్లూ, తాను దానివలన బాధలుపడుతూ సహిస్తూ, సద్దుకుపోతున్న

ట్లా మాట్లాడే మనిషికి మొగడై ఉండేకంటేచస్తేనే మేలు అనిపించింది.

నేను ఇంత బాధపడ్డా ఆవిడ. చాలా శాంతంగాతొణకకుండా, నిర్లక్ష్యంగా "ఆ పట్టండి. పట్టండి. అవతల నాకుపనుంది పోవాలె. మీకేం అల్లాగ మూడు రోజులైనా శలించి పోట్లాడుతునే ఉంటారు" అన్నది.

"అంటే నేనెప్పుడూ పోట్లాడేమనిషి నన్నమాట?"

"నేనన్నానా ఏమిటి? అన్నీ మీరే అనుకుంటారు."

"మరి ఏమిటి నీవన్నది. నీవన్నదానికి అర్థం ఏమిటి?"

"ఏదో అన్నాలెండి. ఈ అర్థాలూ గిర్థాలూ నాకు తెలియవు. నే నేం చదువుకొన్న దాన్ని గాదు."

మూడురోజులైనా సలించి పోట్లాడుతునే ఉంటారని మళ్ళీమీరు పోట్లాడేమనిషని నేనన్నానాఅంటుందీ-ఇదేమన్నా మనిషా లేకపోతే గ్రీకుకథలలోని మెడూసా ఆ...

బండికి పోవలసినటైము అవుతున్నది. ఈవిడ మాటలు చూస్తే, మండి పోతున్నది. కోపందిగమ్రింగి పారేయ్. ఆనాలుగు ధోవతులూ, ఆ చొక్కాలుమూడూ ఆరెండుతువాళ్ళూ అందులో పడెయ్యి. ఆసిల్కుఉత్తరీయంకూడా కావాలెవెయ్యి అన్నాను.

అది వద్దు లెండి.

ఏం? నీఆజ్ఞ ఏమిటి? నాకు కావాలె. అదికూడాఅందులో పడెయ్యి. టైము అయింది. తొందరగా స్టేషనుకు పోవాలె.

"నా ఆజ్ఞ టే? నాఆజ్ఞలన్నీ సాగి ఏడు స్తున్నాయా? అది ఇంట్లో ఉంచి ఇంకో ఉత్తరీయం తీసుకొని వెళ్ళండి. ఎందుకు చెప్పానో నా మాటవినండి.

అబ్బబ్బ !! ఎందుకు వద్దో చెప్పరాదూ ?

మీ రెందుకు వింటారు. ముద్దుగా వినే మొగుడై తేగదా అనోము నేనోచుకోలేదు. ప్రతిదానికి కారణం చెప్పేడవాలె. ఆడచచ్చిందాన్ని ఎన్నిటికని చెప్పేది కారణాలు. మీరుదాన్ని పారేసుకొస్తారు.

ఇన్ని మాట్లు ఇన్ని ప్రయాణాలుచేస్తున్నాను. ప్రతి దఫాపారేసుకొని వస్తున్నా నా, ఏమిటా మాటా ?

ప్రతిదానికీని విసుకేనా ? అయినదానికీ కానిదానికీ కూడా ? మీరు అసలు అజాగ్రత్త మనుష్యులు. ఎక్కడో మరచిపోయి వస్తారని మంచిమాట చెప్పినా రుసరుసలై తే ఎట్లా ఏడ్చేది ?

నేను అజాగ్రత్తమనిషినా ? బట్టలు ఊళ్ళవెంట పారే స్తు న్నా నూ? రెండుపెట్టెలూ, మూడుమూటలూ, తట్టలూ బుట్టలతోటి నీవువెళ్ళినపుడు ఎందుకని నేను ఏమన్నా అన్నా నా? అందులో మళ్ళీ ఎన్ని తిరిగివచ్చినవి అని లెక్కజూశానా? నా బట్టలవిషయమై కూడా నీకింత అధికారమేమిటి ?

నాఇష్టం వచ్చిన బట్టనేను వాడుకోవడానికికూడా నాకుఅధికారంలేదా ?

"అదిగో మళ్ళీ మొదలుపెట్టారూ."

"మొదలు పెట్టిం దినీవానేనా? ఒకమాటుచీవాట్లువేస్తే

సిగ్గుఉండి, అయ్యో, ఆయనకు మనస్సు కష్టం గలిగించేమాట అనకూడదని బుద్ధి, జ్ఞానం, వివేకం తెలివితేటలుఉంటేగా ?

ఇప్పుడేమన్నానని చెప్పండి, అన్ని మాటలు అనటం నన్నూ ?"

ఎన్నోమాటలు అన్నట్లుమాట్లాడుతావేం ? ఆమాటలకన్నిటికీ ఒకటే అర్థం.

"అవునవునూ, మీరెన్నీ అన్నా బాగానే ఉంటుంది! మీరన్నమాటల కన్నిటికి ఒకటేఅర్థం నేనేమన్నా ఒక్కమాట తెలిసో తెలియకో అంటే నానా అర్థాలూ,తీస్తారు.

ఇక కట్టి పెట్టు. ఆసూట్ కేస్ ఇల్లా ఇచ్చేయి. వెళ్ళిపోవాలె. ఇంతకూ ఆసిల్కుఉత్తరీయం వేశావా ?

రేపు శుక్రవారంనాడు ! పేరంటానికి ఆఉత్తరీయం వోణీగా వేసుకొంటానని పిల్లసరదా పడ్డది అందుకనిఉంచేశాను. మీకిష్టంకాకపోతే తీసు కెళ్ళండి.

పిల్ల కావాలన్నదని మొదటనే చెప్పకపోయినావూ? సరే ఆపెట్టె ఇల్లా ఇచ్చెయి.

"ఇందండి. అయితే మొన్న మాతమ్ముడిచ్చిన సేలం అంచు ధోవతులు తీసి కెడుతున్నారు ఎక్కడో పారేస్తారు. మీకు తగని మరుపు."

"అబ్బా, మనిషికిఉండే తెలివితక్కువ తనం, మరుపూ, మొదలుగా గల దుర్గుణాలన్నీ నా ఒక్కడిలోనే చేరినట్లుమాట్లాడుతావు గదా ! నీతో నాకూ..."

"పోనీ లెండి. ఇక బయలు దేరండి."

"బండిని కేకెయ్యవే అమ్మాయీ"

బండి ఎందుకూ! సూట్ కేస్ చేతపట్టుకొని నాలుగు అడుగులు చర చర నడిచి పోరాదూ ?"

"ఈ ఒకటిన్నర మైలూ, ఈ పెట్టె నెత్తిని వేసుకొని నేను నడవాలిసిందే ?"

"మొగాళ్ళు ఎంతలోకి నడుస్తారూ?"

"ఇక నీవు ఊరుకో, నన్ను మండించక. వెధవవాగుడు వాగకూ, బండిని పిలవ్వే."

"......................."

'ఉండవోయ్ గురన్నా. బండినిఆపమన వేలమ్మాయీ'

"ఎందుకే అమ్మాయీ ?"

"అమ్మ ఆపమంటుంది నాన్నా."

"అమ్మకేం అట్లాగేఅంటుంది. నాకు టైము అయింది"

వస్తున్నా, వస్తున్నా ఉండండి. అబ్బ అయినంతసేపూ కాంగా ఇంతలో తొందర వచ్చిందే ? ఇందాక పోట్లాటవేసుకొని కూర్చుంటానికి ఏతొందర లేదూ... !"

"సరేకాని, నేనా పోట్లాటవేసుకొని కూర్చుందీ ? పోట్లాడటానికైనా టైము లేదు. ఎందుకు ఆపినావు? అదేమిటి? ఆచేతులో బుట్ట ఏమిటి?"

"కొత్తఆవకాయ. దార్లోగుంటూరులో మా అక్కయ్యగారింట్లో ఇవ్వండి"

"ఏడ్చినట్లే ఉంది. తీసుకొనిపో, వెధవ ఆవకాయ బుట్ట మోసుకు పొమ్మంటావు? ఎర్రని ద్రవం దానిలోనుంచి కారుతూఉంటుంది గదా?"

"మిమ్ములను మొయ్యమన్నానా? మీరు మొయ్యాల నా? స్టేషనుదాకా ఎట్లాగూ బండిఉందిగదా? ఇక్కడ రైలులో పడేస్తే అక్కడ దింపటమే కదా ఇకమీరు మోసేదెక్కడ"

"స్టేషను దగ్గరనుంచీ ఇంటికి ఎవరు మోస్తారు."

"స్టేషను దగ్గరనుంచి ఆకాస్త దూరం చేత్తో పట్టుకు పోవచ్చు. పాపం దాని పిల్లలకు చద్ది వణ్ణంలోకైనా ఉంటుం దనిఆశ పడ్డాను. పోనీ లెండి. ఆపేక్ష ఉంటేగదా, నామీద నూ మా వాళ్ళమీదనూ, సరేపొండి ఏం జేస్తానూ?"

"ఓసి' తెలివితక్కువ మొద్దూ' బందరునుండిఒంగోలు కుపోయే దోవలో గుంటూరు తగలదు. అదీ అసలు సంగతి!'

"ఆ! తగలకేంలెండి. ఇష్టమైతే బాగా నేతగులుతుంది!!'

# ఇరుగు - పొరుగు

మన ఇంటిప్రక్కన ఉన్నవాళ్లను బట్టి ఉంటుంది మన సౌఖ్యం.

ఇరుగూ పొరుగూ అన్నారు. మనకు కీర్తి వచ్చినా అపకీర్తి వచ్చినా వాళ్లవల్లె వస్తుంది. మన ఇంటిప్రక్కన ఒక ప్లీడరు గుమాస్తా ఉన్నాడనుకోండి. ఇక మనకర్మం కాలిందన్నమాటే. ఆ ఇంట్లో అత్తకూ కోడలకూ పడదు. అత్త ఆపిల్లను కాల్చుకుతింటూ ఉంటుంది. ఆపిల్ల అప్పుడప్పుడు మన ఇంటికి వస్తూ ఉంటుంది ఆ అమ్మాయి మనతో ఏవో నేరాలు చెపుతున్నదని ఆ ముసలిదానికి అనుమానం.

ఓమారు సరిగ్గా అలాగే జరిగింది గదా. మా ఆవిడ మా ఇంటిప్రక్కావిడ కోడలూ ఒక్క ఈడువాళ్ళు. అంచేత ఆపిల్ల మాఇంటికి వచ్చి ఏదో పిచ్చాపాటి కాసేపు మాట్లాడుకొని వెళ్ళిపోతుండేది. ఆ ముసలిదానికి మా ఆవిడపైన క్రోరుగాఉండేది. ఏమీ అనలేక వీలైనపుడల్లా ఏవో సూటీపోటీమాటలు అనటం సాగించింది.

అందరళ్ళల్లోనూ ఉంటై తగూలు. పొరుగింటి తగూ అంటే కొందరు చెవి కోసుకుంటారు. అత్తమామల్లో, ఆడబిడ్డల్లో కాపురం చేయకుండా అదృష్ట వశాత్తు పొరుగూరిలో ఒంటరి కాపురం చేస్తున్నది కాబట్టి ఆకాంతమ్మ కింగురంగా

అంటూ కులుకుతున్నది. అర్ధశేరు బియ్యం అత్తెసరు వేసి, రెండు వంకాయలు వేయించిందా అంటే ఇక పనేలేదు ఆ అమ్మాయికి అల్లాగ ఉండాలంటే ఎల్లాగ వీలు అవుతుం దమ్మా అందరికీనీ-అని ఇల్లాగ ఏవో సాధింపు మాటలు అంటూ ఉండేది. అప్పుడు మాకాంతం కొత్తగా కాపురానికి వచ్చిన రోజులు. ఇంకా మాకు సంతానం కలగలేదు.

పిల్లా జల్లా లేకుండా ఒంటరి కాపురం చేస్తున్న రోజు ల్లోపొరుగింటి వాళ్ళు ఎల్లాంటి వాళ్ళు అయినా మనకు అట్టే బాధ ఉండదు. అయితే కాస్త జాగ్రత్తగా ఉండాలిసిందల్లా భార్య పుట్టింటికి వెళ్ళినప్పుడే. ఆ నాలుగు నెలలో ఆరు నెలలో మటుకు వంచిన తల ఎత్తకుండా నడవాలి ఆవీధిలో. అప్పుడే మన గౌరవం దక్కుతుంది. ఇంటావిడ, బిడ్డకు మూడో నెల వెళ్ళకముందే వచ్చినపుడు, ఇంటి ప్రక్కవా ళ్ళుమనలని గురించి మంచిగా చెబుతారు. లేక...

నీవు ఒకరోజున స్నానంచేస్తూ ఉండటం-ఆసమయా న్నే పొరిగింటి ఆవిడ కోడలు పూల జడ వేసుకొనిదొడ్డిగోడ మీాదుగా తొంగి చూడటం నీవు ఆ చక్కని పిల్లను సివ్వెర పోయి చూస్తూ అవతల వంటింటి గుమ్మంలోనుంచి ఆ అమ్మాయి అత్తగారు గుడ్లు మిటకరించి చూస్తున్నట్లు గమ నించక పోవటం, ఇత్యాది విషయాలు జరిగినయ్యా, నీకర్మం కాలిందే.

అసలే అనుమాన పడుతుంటుంది మీాఆవిడ. మొగుడి మీాద ప్రేమ ఉన్న ప్రతి మానవతికి అటువంటి అనుమానం

7

ఉండటం సహజం. అందులో తాను లేనప్పుడుఏమి అన్యాయం జరిగిందో నని భయపడుతూనే వస్తుంది మీ ఆవిడ. వచ్చే రావటంతోనే కొంప మునిగిపోయినట్లు పనిగట్టుకొని వచ్చి ఆ ముసలిముండ ? మీద నేరాలుచెప్పేస్తుంది ఉన్నవి కొన్ని, లేనివి కొన్నిని. నీవు ఎంతో ఉత్సాహంతో ఇంటికి వస్తావు ఎన్నాళ్ళకోవచ్చిన భార్యను చూచి కబుర్లు చెప్పుకుందామనీ బిడ్డను ముద్దాడుదామని ఆదుర్దాతో ఇంటికి వచ్చేసరికి బుస బుసలూ రొస రొసలూనూ మీ ఆవిడ. కారణమూ నీకు తెలియదు ఆవిడ చెప్పనూ చెప్పదూ. ఏమిటి కాంతం, అది నేననేమాట. నీవుకూడా ఏదో పేరు పెట్టి పిలుస్తావుగా. ఏమిటే, 'రాజ్యం సుబ్బులూ, లక్ష్మి (ఏదో ఒకటి) ఎందుకే అల్లాగ ఉన్నావు. సంతోషంగా లేవేం? అమ్మాయికి ఇంకా నీళ్ళు పోశావుకావేం, మధ్యాహ్నం కాఫీ తాగలేదా అంటూ ఏవో వెయ్యి ప్రశ్నలు వేస్తావు. నాసంగతి మీకెందుకు లెద్దురూ. మీకు నేనే కావాలిసి వచ్చాను. అనో లేకపోతే ఇంకా మృదువుగానో ఏదో నీరసం మాట అనేస్తుంది, మీ ఆవిడ. అసలు సంగతి చెప్పదు. ఆ సాయింత్రం నీవు బ్రతిమిలాడినా, ఒట్టిదే భయపెట్టినా ఒట్టిదే. ఆరాత్రికి ఎప్పుడో బయట పెడుతుంది అసలు సంగతి నీవుఎంతో బ్రతిమిలాడినతరువాత. ఆతరువాత. అదంతా అబద్ధం అని నచ్చజెప్పే టప్పటికి తల ప్రాణం తోకకు వస్తుంది ఇదేమైనా నలుగురిని పిలిచి నిలవ దీసి అడిగి నిజం తేల్చే విషయం కాదాయె. ఎల్లాగ మీ ఆవిడను నమ్మించటం. చాలా కష్టం ప్రాణంమీదికివస్తుంది.

కాబట్టి ఇరుగూ పొరుగూతో బహుజాగ్రత్తగా ప్రవర్తించాలి. అనుభవంమీద వ్రాస్తున్నాను.

సాధారణంగా నీవు అద్దెకు ఇల్లు తీసుకొనే టప్పుడు మీఇంటి ప్రక్కవాళ్ళకు ఫోను గాని రేడియోగానిఉండేటట్లు చూచుకో. సాధారణంగా వెన్నెల రాత్రిళ్ళు, భోజనానంతరం వాళ్లు ఫోను పెట్టుకొని కూర్చుంటారు. మనకు అదిచాలా అనుకూలం. మనకే ఫోను ఉంటే, ఉండే బాధలు ఏమీలేకుండా, ఫోను ఉండటం మూలాన కలిగే సౌఖ్యం అంతా అనుభవించవచ్చు మన నెవ్వరూ ఫోను ఇవ్వమని అడగరు. రికార్డులవిషయంలో అప్ టు డేట్ గా మాట్లాడుతూ, స్వంతానికి ఫోను కలిగి ఉన్న వాళ్ళలాగే మాట్లాడ వచ్చును.

మన ఇంటిప్రక్కవాళ్ళకు పిల్లలుఉండకూడదు. అంటే నీవు అట్లా కోరాలని నేను అనను. నీవు కోరినంత మాత్రాన వాళ్ళకు పిల్లలు కలుగకుండా ఉండటమూ జరుగదు. అయినా అటువంటి కోరికలు కోరమని కాదు నేననటం. పిల్లలు లేని సంసారంప్రక్కనే నీవు ఉండూ అంటాను.

పిల్లలు ఉంటే...

వాళ్ళపిల్లలకూ మన పిల్లలకుం పోట్లాటలు తప్పవు, ఒకమారు నేను ఉన్న ఇంటిప్రక్క ఆయనకు నలుగురు పిల్లలుండటం తటస్థించింది. ఇక మా అవస్థ చెప్పటానికి వీలులేదు. మొదట్లో వాళ్ళ పిల్లలూ మాపిల్లలూ కలిసి ఆడుకుంటారని సంతోషించాను. కాని ఏం జరిగిందంటే



వాళ్ళ రామూ ఎఱ్ఱ కాగితం ఒకటి పుల్లకు గుచ్చి ఆడుకొంటూ ఉన్నాడు. మా రాధాయి చూశాడు దాన్ని. పోనీ తనకూ అటువంటిది ఒకటి కావాలని చెపితే చేసి ఇవ్వనూ. ఉహు. అల్లాగ చెప్పక, వాడి చేతులో కాగితాన్ని గద్దతన్నుకొచ్చినట్లు లటిక్కున లాక్కొచ్చాడు ఇంక వాడి సంగతి. చప్పున వచ్చి నాతోనో, తల్లితోనో, మీ అబ్బాయి నా ఎఱ్ఱ కాగితం లాక్కున్నాడు. నాది నాకు ఇప్పించండి అని అడగవచ్చునా. మాటలు వచ్చిన వెధవ అహా అట్లా అడక్క, తపీ మని నేలపై పడిపోయి, కెవ్వున కేకేసి, ఒక్క పెట్టున ఏడ్పు సాగించాడు. బట్టలు బాడీ అయినై. వాళ్ళ అమ్మ ఒచ్చి ఏమిట్రా నాయినా అని ఎంతోసేపు అడిగితే చివరకు చెప్పాడు ఈ అన్యాయాన్ని గురించి. ఆమె వచ్చి మా ఆవిడమీద కేక వేసింది. ఏమిటమ్మా, మీ రాధాయి పిల్లల చేతుల్లో చిల్లిగవ్వ అయినా నిలవనీయడు, తపీమని గద్దతన్నుకు పోయినట్లు తన్నుకుపోతాడు ఎట్లాగ ఏడ్చేదమ్మా అని. ఈవిడకూ ఉక్రోషం. నా కొడుకు అంత చెడ్డవాడా అని......మీ వాడూ అంతేనమ్మా అన్నది. అక్కడనుంచి వేసుకొన్నారు పోట్లాట ఒక అరగంట సాగింది. ఇంతలో మా రాధాయి ఆ కాయితం కాస్తా చింపేశాడు. ఆ సంగతి రామూ కనిపెట్టి మళ్ళీ కెవ్వు మన్నాడు. ఇంతలోకి నేనొచ్చి రామూను ఊరుకో పెడదామని ఇంకో ఎఱ్ఱ కాయితం ఇస్తే ఒప్పుకోడే! పోనీ ఎన్ని రంగు కాయితాలిచ్చినా ఒప్పుకోడే! ఆ కాయితమే కావాలంటాడు. చినిగిపోయింది రా నాయనా ఆ కాయితం ఇంకోటి తీసుకోరా అంటే వినడే! ఎల్లాగ వీళ్ళ

తగూతీర్చటం!!! కాబట్టి ఇంతకూ చెప్పవచ్చేదేమిటి అంటే ఈ పిల్లల తగూలతో ప్రాణం హైరాన అవుతుంది. కొంచెం ముందుగానే జాగ్రత్తపడి పిల్లా జెల్లా లేనివాళ్ళకు దగ్గరగా ఉండటం మంచిది. ప్రక్క ఇంటి వాళ్ళకు పిల్లలు లేకపోతే మన పిల్లలనే ఎత్తుకొని ముద్దాడి మిఠాయి, లడ్డూ, అవీ, తరుచు వాళ్ళకు పెడుతూ ఉంటారు.

మన ఇంటి ప్రక్కవాళ్ళకు కారు కూడా ఉంటే మంచిది ఎప్పుడైనా అందులో ఎక్కి మనం కూడా షికారు వెళ్ళటానికి అవకాశం ఉంటుంది.

మన ఇంటిప్రక్క ఆవిడ చక్కని డ్రెస్ ఫ్యాషన్ తెలిసినదైతే చాలా అదృష్టం. ఆమె మన ఆడవాళ్ళకు అప్పుడప్పుడు తలదువ్వి పూలుపెట్టి కట్టూ బొట్టూ నేర్పుతుంది.

మన పిల్లలను రోజూ ముస్తాబుచేసే పని ఆమెకే అప్పజెప్పెయ్యాలి. మన పిల్లలు ఆమెను అత్తయ్య అని పిలుస్తూ, ఎప్పుడూ అక్కడే కాలం గడుపుతూ ఆడుకుంటూ ఉండటం జరుగుతుంది.

దేముడు మేలుచేసి, మన ఇంటిప్రక్క వాళ్ళు డబ్బున్న వాళ్ళుఅయి ఉండాలని మనం కోరుకోవాలె. అల్లాగ అయితే వాళ్ళుమనలను ఎప్పుడూ డబ్బు అప్పు అడగరు. కాస్తో కూస్తోవాళ్ళ వద్దే మనము అప్పు పుచ్చుకోవచ్చు.

మన ఇంటి ప్రక్కవారి దొడ్లో కాస్త కాయా కూరా పండుతూ ఉండటం, పూలూ అవీ పూస్తూ వుండటం కూడా అవసరం—

# వెన్నెలలో

—∘∘⁘∘∘—

తెల్లటిచీర కట్టుకొన్నది. తల దువ్వుకొని అర్ధచంద్రాకారంగా మల్లెపూలు పెట్టుకొని, వాటి మధ్య గులాబీలు అమర్చింది. పచ్చని మెడలో జారిపోతులాగ బంగారపు గొలుసొకటి మెరుస్తూంది పిల్లలను నిద్రపుచ్చి వచ్చింది నాదగ్గరకు నేను పండువెన్నెలలో మంచంమీద పరుపువేసుకొని, పైన తెల్లదుప్పటి పర్చుకొని, తలవైపు దీపం పెట్టుకొని, పడుకొని చదువుకొంటున్నాను వచ్చి,

"ఏమిటండీ చదువుతున్నారూ" అన్నది మందహాసం చేస్తూ. మాట్లాడలేను.

"మాట్లాడరా, మీలో మీరే నవ్వుకోవాలేం? చెప్పండి అదేమిటో" అన్నది దీపం తగ్గిస్తూ.

"చెప్పమంటావా?"

"మరేమిటి నేననటమూ?"

"పద్మములతో సమానమైన ముఖము గల సుందరీ- అంటూంటే మాఆవిడ మాటకు అడ్డం వచ్చి "అదేమిటి ఆవికారం మళ్ళీనూ" అన్నది.

ఇదివరలో ఇల్లాంటి వికారాలు నాకుతరుచూరావటం మా ఆవిడ చికిత్స చేయటం చాలా సార్లుజరిగినాయి. అందు

కని అల్లాగ అన్నది. "ఏమి వికారం కనపడ్డది అప్పుడే నీకు" అన్నాను నేను.

"ఆమాట లేమిటీ? పద్మములతో సమానమైన ముఖ ముగలదానా అని అనటం ఎందుకూ నన్ను వచ్చి రావటం తోనే—ఇవీ ఆవిడ మాటలు.

నిన్నెవరన్నారూ ? ఇవి నా మాటలు.

"మరి ఎవరినన్నా రేమిటి ? నేనుఇంకా నన్నే అన్నా రనుకొంటున్నా, ఇంకా ఎవరినైనా కూడా...ఇల్లాంటి మాట లుఅంటూ ఉన్నారా ఏమిటీ!! లేకపోతే కలవరిస్తున్నారా?" అన్నది మా కాంతం నాప్రక్కనే నన్ను ఆనుకొని కూర్చుని.

దానికేదన్నా జవాబు చెప్పాలెగదా నేను. చెప్పలేదు. నవ్వనైనా నవ్వలేదు. ఊరికే అల్లాగ ఉండిపోయినాను. పుస్త కం లాగ పడుకొని ఊరుకొన్నాను. పలకలేను; ఉలకలేదు.

నేనంటే బుద్ధి చెప్పుకొని ఊరుకొన్నానుగాని ఆనోరు లేనిచేతులకు ఏం తెలుసు పాపం. తలక్రిందవున్న ఎడమచేయి పడగవిప్పిన పాములాగ లేచి ఆమె కటిస్థానాన్ని చుట్టివేసింది. ఇక అంతపని జరిగిన తరువాత ఊరుకోటం ఎందుకని నేనూ, ఒక వేలును నాభిస్థానానికి తాకించిచక్కిలిగింత పెట్టాను.

" నిన్ను అనటంకాదూ...ఇంకొకరిని అనటమూ కాదు. పుస్తకాల్లో మాటలు చదువు తున్నాను." అని అప్పటికి తెముల్చుకొని జవాబు చెప్పగలిగినాను. "అల్లాగా! ఏమిటీ ? చదవండి, చదవండి. ఎవరు అంటూ ఉన్నారూ, ఏమిటి సంద

ర్థం ? చెప్పండి కథ ఏమిటో – వింటానూ." అన్నది మాఆవిడ వంగి, నాముఖంమీద ముఖంపెట్టి, చెదరిన నా క్రాపును సవరిస్తూ.

"చెప్పటానికి పెద్ద కథ ఏమీ లేదు ఇందులో, ఇదొక వైద్యగ్రంథమూ, ఇందులో..."

"వైద్యగ్రంథమూ అంటే మందూ మాకూ"

"ఆ అదే అదే. రోగాలూ, రోగలక్షణాలూ వాటిని చికిత్స చేయాలిసిన విధం అదంతా ఈ పుస్తకంలో వ్రాశాడు గ్రంథకర్త" అన్నాను.

ఈ మాటలుఅంటూ నేఉన్నానూ, నాకుడిచెయ్యిపుస్తకాన్ని వదిలేసి, అమాంతంగా, దానంతట అదే వెళ్ళిపోయి ఆమె చెక్కిళ్ళమీద పడిపోయింది. అందులో నాప్రయత్నం ఏమీ లేదు.

ఆవిడ నా చెయ్యి మెల్లగా, బహుజాగ్రత్తగా తీసింది. అదేదో నలిగిపోగల మెత్తని పువ్వులాగ తీసి, తన రొమ్ముపై నానించుకొని నా వేళ్ళసందుల్లోకి తన వేళ్ళు పోనిచ్చి, విలాసంగా నొక్కుతూ మళ్ళీ అన్నదీ "అయితే చూడండీ. రోగాలసంగతి చదువుతుంటే నవ్వు ఎందుకు వచ్చిందండీ?"అని.

"దానికి ఒకటీ...రెండూ...చూశావా రెండు కారణాలున్నాయి" అన్నాను, చెయ్యి చిలిపిచేష్టలు చేస్తూ ఉండంగానే.

"ఆ రెండు కారణాలూ ఎల్లాంటివో నొక్కి వక్కాణించండి" అన్నది మా ఆవిడ నవ్వుతూ, నా చెక్కిళ్ళు కూడా నొక్కింది.

"అల్లాగే... అంతకంటే సంతోష విషయమేముందీ! మొదటి విషయం, ఈ వైద్యగ్రంథకర్త లోలంబరాజు, వైద్య గ్రంథాన్ని అంతా తన ప్రియురాలుకు చెప్పినట్లుగా వర్ణించాడు.

"అయితే మీకు నవ్వ ఎందుకూ?"

"నేను నాకథలన్నీ నీ పేరనే వ్రాసినట్టుగా ఉందని నవ్వువచ్చింది."

"అల్లాగ కాదు. మీరు వ్రాసే పుస్తకాలన్నీ కూడా నాకు చెప్పినట్లుగా వ్రాయండి. "ఓ కాంతం – అక్బరు చక్రవర్తి మహమ్మదీయుడు అయ్యు – హిందువులయెడ మిక్కిలి దయతో ప్రవర్తించడం చాలా గొప్ప విషయము సుమా! అని ఈ ధోరణిలో వ్రాయండి"

"సరేలే. అది అట్లాగుంచు. ఇక్కడ వ్రాస్తాడూ, ఓ రత్నకలా, కటకరోహిణి కషాయము నోటి అసహ్యమును పోగొట్టుటయున్నూ తామర మొగ్గలవంటి కుచములు గల స్త్రీని ఆలింగనము చేసికొనుటవలన స్త్రీకి సంతోషము గలుగుటయున్నూ, అనునీ రెండున్నూ నాకు ఆశ్చర్యముగాఉన్నవీ అని."

"ఇక ఈవిషయం ఈపాటున కట్టిపెట్టి మీరు నవ్వటానికి ఆ రెండో కారణం ఏదో అది కొంచెం నొక్కకుండా వక్కాణించండి"

8

"రెండోది ఏముందిలే...అది సామాన్యవిషయమే. ఆపుస్తకంలో రోగాలను గురించి చదువుతూ ఉంటే ఆ రోగ లక్షణాలన్నీ నాకు ఉన్నట్లు తోస్తున్నది. సన్నిపాత లక్షణాలను గురించి చెపుతూ...శరీర మంతయు నొచ్చుట మొదటి విషయమూ అన్నాడు. ఇప్పుడు నాకు శరీరమంతా నొప్పులు గాఉంది. "ఉరిమి చూచుట అన్నాడు తరువాత."

"అది మీకు అలవాటే అయెను. చీటికి మాటికి ఉరిమిచూస్తుంటారు. ఈ లక్షణం మట్టుకు మీకు తీవ్రంగా ఉన్నట్లు నేనే ఒప్పుకొంటాను" అన్నది.

"సరే నీవే ఒప్పుకొన్నావా! ఇక మూడో లక్షణం కను బొమ్మలు ముడిపడుటా అనిఉంది."

"సరి సరి. ఇక చెప్పక్కర్లేదు. ఉరిమిచూట్టం కనుబొమలుముడిపడటం మనకు సహజలక్షణాలేనాయె. తరువాత?"

"తరువాత ఆడటం...పాడటం అన్నాడు."

"అవి ఇంకా పుట్టలేదనుకొంటా" అన్నది మాఆవిడ

"పుట్టకేం? ఇపుడు పుట్టినాయి ఇపుడు లేచిఆడి పాడుదామా అనిపిస్తున్నది."

"కాబట్టి ఏమంటారు ఇంతకూ?"

"ఏమనేది, ఏమున్నదీ...చిత్తవిభ్రమ సన్నిపాతం నాకు పూర్తిగా కలిగింది."

"ఏబ్బే? ఏంమాటలివి..."

"ఉన్నమాటలంటే నీకుఅంతకష్టం ఎందుకూ? కలిగిన

మాట నిజము—చిత్త..విభ్రమ...సన్నిపాతం— తెలిసిందా?" అని మాట విడదీసి ఉచ్చరించాను.

"మీకా, చిత్త - విభ్రమ-సన్నిపాతమా? అని పకపకా నవ్వుతూ, తన రెండు చేతులలో నాతలను తన మెత్తని ముఖానికి అద్దుకొంది."

పేరంటానికి వెళ్ళి వచ్చింది కాబోలు ఆరోజు. మెడకు మంచిపరిమళముగల గంధం పూశారు, ఆసువాసన, ఆతల నూనెకు సంబంధించినపరిమళం నాకు మత్తెక్కించినై. నాకు కళ్ళుమూతలు పడ్డాయి.

ఆమె పెదవులు నాబుగ్గలను వెచ్చగా తాకేటంతవరకునాకు ఈ లోకమే తెలియదు.

నిజంగా నేనుఆరోజున ఏదో స్వర్గసౌఖ్యాన్ని అనుభవించాను. నేను కవినిగాదు. భాషరాదు, ఆసౌఖ్యాన్ని వర్ణించలేను, కాని అనుభవించాను. ఈజన్మకు ఆఖరుసారి అనుభవించాను. ఆసౌఖ్యముయొక్క లోతూ రంగూ, ఆనందమూఅనుభవించిన వాళ్ళకే తెలియాలె.

కాని ఆ ఆనందం ఇల్లాంటిదీ అని చెప్పటానికి నోరు లేదే అని ఏడుపొస్తున్నది. చెప్పలేక పోసిండి. కాని నేను ఆనందాన్ని పొందినమాట నిజమేగా! !అనుభవించాను. అనుభవించాను. అనుభవించాను. ఈజన్మలో ఇక అనుభవించను. ఆరోజుననిజంగా చిత్తవిభ్రమ సన్నిపాతం కలిగింది.

కలిగింది చిత్తవిభ్రమ సన్నిపాతం. అందుకనిఅన్నానూ ఆవిడతో అప్పుడూ, "నిజంగా కాంతం! నాకు ఆజబ్బు ఏర్పడ్డదీ" అన్నాను.

"చాల్లే...ఊరుకోండీ—పోనీ అయినా ఆ జబ్బుకు చికిత్స ఏమిటో చదవండీ చూద్దామూ అన్నది.

"ఈ రోగాలకూ—కషాయాలు పనికిరావట!

"ఊఁ"

"లేహ్యాలు అసలే పనికిరావట!"

"మరి ఏమన్నాడండీ——?" అన్నది తన చేతితో నాచేతిని నొక్కుతూ.

"శ్లోకం విను"

"అర్థం చెప్పందురూ. ఇపుడు శ్లోకాలువినటానికి ఓపికెక్కడఉందీ! నిద్రవస్తున్నది." అని పక్కపైన ఒరిగి పండుకొనిఆవలించి రెండుచిటికలు వేసింది. మెళ్ళో గొలుసు పక్కకుజారి తళుక్కుమన్నది వెన్నెల్లో. ఆ తెల్లని వెన్నెల్లో ఆమె బుగ్గలు నీటి బుడగలలాగ మెరసినవి. ఆముఖచంద్రుడిదగ్గర ఆర్ద్రినక్షత్రంలాగ ఆ క్రిందిపెదవి ఎర్రగాఉంది. మల్లెపూలు జారి కొన్ని పక్కమీద పడ్డయి.

దృఢమాలింగనం పథ్యం
శ్వాధశ్చాధరచుంబనమ్—

"వింటున్నావా— ప్రియురాలియొక్క అధర చుంబనమే కషాయమట......ఆమె గాఢాలింగనమే పథ్యమట. ఆఁ విన్నావా? కాబట్టి..."

"ఊఁ కాబట్టీ— ఆఁ కాబట్టీ—చెప్పండిఏమిటో"

"కాబట్టీ ఇప్పుడేంచేయాలో తెలుసునా నా ఈరోగం నయంకావాలంటే!"

"ఊఁ ఏంచెయ్యాలా?...ఆ......

"అబ్బా!" ఊరుకోండి"

పుస్తకం, ఇకమాపక్కన ఉండటానికి ఇష్టంలేక ఠపీమని కింద పడిపోయింది.

---

# ప్రయాణసన్నాహం

(ఆంధ్రదేశంలోని కథకుల్లో మునిమాణిక్యం, మునిమాణిక్యమే!—అని 'ఢంకా' బజాయించి చెప్పగలం.

"మా ఆవిడ ముడిలోని ఎఱ్ఱని మందారపుష్పం ఒంటరిగా ఉండి నావంక చురచుర చూసింది..."

ఆహా! ఏమివర్ణన! కాంతంయొక్క ప్రణయంతో కూడుకొన్న కోపాన్ని సూచించేందుకు వుపమానంగా ఎఱ్ఱని మందారపుష్పం తీసుకొన్నాడు. అందులో ఆపుష్పం కాంతం తలలో ఒంటరిగా వుండటం—అంటే కాంతం యొక్క కోపతీవ్రత తన మనస్సులో యెంతవేదన, తపన కలిగిస్తుందో ప్రత్యక్షంగా చూపెట్టారు.

అసలు కాంతం కాలంచేసినతర్వాత కాంతం కథకుడి కలం సాగదని అతడు అధైర్యపడ్డాడు. మనం అధైర్యపడ్డాం కాని, అసలు కాంతమే తానూ తానే కాంతగా వున్న మునిమాణిక్యంగారి కలానికి ఆటంకమేముంది?)

౧

హంపీప్రయాణంఅనుకున్నరోజునుంచీఆవిడకు నామీద ఇంతవరకుంది ముక్కు ముడుచుకొని, మూతి మూరెడు పొడుగు చేసుకొని బుసలు కొడుతూ వుంది. పోనీ ఆవిడను కూడా తీసుకొని వెడదామా అంటే, అయిదుగురు పిల్లలతో

ఆమె కదలటమూ కష్టమే. కదిలినా వంద రూపాయలన్నా వదలంది యాత్ర పూర్తిగానూ కాదు. నేనైతే ఒంటరిగా పది రూపాయల టిక్కెట్టుమీద ఇట్టే వెళ్ళి రావచ్చు.

ఆవిడతో ఈమాట అనకముందే నేను చేయవలసిన ప్రయత్నాలన్నీ చేసేసుకొన్నాను. జీర్ణ కర్ణాటకసామ్రాజ్యం హంపీయాత్ర, హంపీ క్షేత్రం మొదలైన పుస్తకాలన్నీ కొని ఓమారు చదివేసి పెట్టెలో జాగ్రత్తచేశాను. ప్రయాణానికీ, అక్కడ మూడురోజుల మకాంకూ, కావలసిన సరంజామా అంతా కూర్చుకొన్నాను. చలికి రెండు స్వెట్టర్లూ, కప్పుకుంటానికి ఒక మంచి రగ్గూ, అందు ముఖ్యమైనవి జ్వరం రాకుండా జాగ్రత్తపడటానికి క్వైనైను, తలనొప్పివస్తే ఉపయోగించటానికి కెఫియాస్పిరిన్, ఒక అమృతాంజనంసీసా, ఒక ఫ్రూట్‌సాల్టు బుడ్డీ కూడా సంపాదించి ఉంచేశాను.

అన్ని ప్రయత్నాలూ అయినతరువాత మాఆవిడతో అనేశాను హంపీ చూసివస్తానూ ఆమటా అని. "ఎందుకండీ వెళ్ళటం, మీకు సెలవొస్తేసరి ఇంట్లో కాలు నిలువదు. హాయిగా పిల్లలతో కలిసి ఇంటిపట్టున ఉండక, పైగా ఇరవై రూపాయలదోదండగా!" అన్నది ఆవిడ. "ఆడదానికి నీకేం తెలుస్తుంది. అక్కడ చాలా విషయాలున్నాయి చూడటానికి. పూర్వపురోజులలో మనరాజులుఏలిన ఒకసామ్రాజ్యానికి అది రాజధాని. వాళ్ళు కట్టిన భవనాలూ సుందరమైన దేవాలయాలూ, తీర్చినవీధులూ అక్కడ వున్నాయి. ప్రకృతి పచ్చపట్టుచీర గట్టుకొని, పూలరవిక తొడుక్కొని

రత్నఖచితమైన కిరీటంతో అక్కడ నృత్యం చేస్తూంటుంది. ఆ రాచనగర భవన నిర్మాణమూ, ఆ శిల్ప చాతురీ, ఆ దేవాలయాల శోభా, చూచితీరాలె'' అన్నాను.

నేను ఈ విషయాలన్నీ చెబుతున్నంతసేపూ ఆవిడ ఎంతో ఓపికగా విన్నది. ఆవిడ అంతఓపికగ్గా వినటమూ, ఆనందించటమూ, చూచి నేను ఎంతో గర్వపడ్డాను. ఒక్క పెంకిమనిషికి నేను ఒకానొక విషయాన్నిగురించి నచ్చజెప్ప గలిగానుగదా అనినా అహంకారము. ఆమె చివరదాకావిని ''అయితే అటువంటిప్రదేశం చూడటంనాకూ ఇష్టమే'' అన్నది. ఒకఅఖండ విజయాన్ని సంపాదించినట్లు సంతోషిం చాను.

ఒక్కక్షణముండి, ''హంపీ, అంతచక్కని ప్రదేశమై తే నేనూవస్తాను. నాకర్మం ఏంకాలింది?''అన్నది మాఆవిడ. ఆవిడన్నమాట తప్పేమనిషి కాదు. వస్తానూఅని అన్నదో వచ్చి తీరిందన్నమాటే! ఏమిటాగతీ అని ముఖంవేలేశాను. ఆవిడ రావటం అంటే చాలాప్రయాసతో కూడుకొన్న విషయమని మళ్ళీనచ్చజెప్పాలె. ఇప్పుడుకాదు రాత్రికి.

ఈవిషయమై ముచ్చటిద్దామూ అనుకొని అప్పటికిమౌ నం వహించాను. అయితే మాకాంతంముఖకళవళి కల్లోనాఅ నుమానాన్ని గ్రహించింది. నేను సందేహిస్తున్నానని పసిప ట్టేసేసింది. ''పోనీలెండి, నన్నుతీసికెళ్ళటం అంటేవస్తుంది!తమ రుఎన్ని దేశాలైనా తిరగవచ్చు; ఆఁ. ఇవన్నీసాగవు. నేనూ మీతో వచ్చితీరుతాను.'' అనికచ్చితంగా చెప్పేసింది ఆవిడ

"రాత్రికి మాట్లాడుతాగా ఆవిషయం" అన్నాను.

"ఏమిటి మాట్లాడేది! బట్టలుసద్దుకొంటాను" అన్నది.

"పిల్లలూ!" అన్నాను నేను ఆదుర్దాగా. "పిల్లలూవస్తారు. వాళ్ళకుమట్టుకు సరదాగాఉండదా!" అనేసిందినిక్కచ్చిగా.

"అయితే ఇప్పుడు యావన్మందీ బయలుదేరాలిసిందే"

"ఆ"

"ఈసంసారాన్ని అంతా నేను హంపీ మోసుకెళ్ళాలిసిందే!"

"ఆఁ ఓ" పెద్దసంసారం! మీరేమీ మోయనక్కరలేదు. రైలుదాకా నడిచేవస్తాము. రైల్లో మేమంతట మేమే ఎక్కుతాము. రైల్లోకూర్చుంటేఅదే మోసుకెళుతుంది! సరేనా!" అన్నది విషయాన్ని అంతా తెగేసి, అందులో ఒక్కపిసరు బాధ అయినా నాకేమీ లేనట్లు తేలుస్తూ.

"అదికాదు కాంతం' మాట"

అని చటుక్కున అనేశాను. పొరపాటున నోరు జారి అన్నాను. 'కాదు' అన్నముక్క అనటమేతరువాయి వచ్చేసింది ఆమెకు బుస్సున కోపం. తాచుపాములాగ జరజరజారిపోయింది ఆవిడ తనవంటఇంట్లోకి. వెధవబుద్ధికి కట్టులేదు. నాఉద్దేశాన్ని రాత్రిదాకా ఉండబట్టలేకపోయింది. మాట జారింది.

౨

రాత్రికి మామూలువేళకు భోజనానికి వెళ్ళాను. ఆవిడ నాతో మాట్లాడదే! మూతి మూరెడు చేసుకొంది.

9

"నెయ్యి?"
"అక్కడే ఉంది గిన్నెలో"
"పిల్లలు నిద్రపోయినారా?"
"పోయా"
"పెద్దతల్లి సంగీతం సాధనచేసిందా?"
"ఆ"
"పులుసు వేస్తావా?"
"ఇవ్వాళ పులుసు లేదు."
"పోనీ మజ్జిగ పొయ్యి."
"మీపక్కనేఉంది సత్తుతప్పాలె. పోసుకోండి"

ఇవీ ప్రశ్నోత్తరాలు ఆరోజు భోజనందగ్గర. రోజూ ఏదో పిచ్చాపాటీ మాట్లాడుకొంటూ సరససల్లాపాలతో అర గంట చేసేభోజనం ఆరోజు అయిదునిమిషాల్లో అయిపోయింది బైట ఆకాశంలో మబ్బులు కమ్మినాయి. భయంకరంగాఉంది తలుపుసందుల్లోనుంచి వచ్చేగాలికి దీపం ఎగిరిఎగిరి పడుతు న్నది. మా ఆవిడ ముడిలోని ఎర్రని మందారపుష్పం ఒంట రిగా ఉండి నావంక చురచుర చూస్తున్నది.

3

ఈబిట్ క్వొశ్చెన్సు-అండ్ ఫిట్ ఆన్సర్సు- వ్యవహారం అయిపోవటంతోనే నేను బైటికొచ్చిసిగరెట్టుకాల్చుకుందామని, నిప్పుపెట్టెకోసం వెదికాను. ఎక్కడాకనిపించలేదు. "కాంతం

నిప్పుపెట్టె?''అన్నాను. వంటయింట్లోనుంచివిసిరిపారేసింది నా కాళ్ళముందు. మెదలకుండా సిగరెట్టు వెలిగించుకొని, రానీ మెల్లగా చెబుతాను. నేను తొందరపడటం ఎందుకూ!అనుకొని ఊరుకొన్నాను.

నేను అక్కడనుంచి పోనేలేదూ, అప్పుడే రెండు నిమిషాల్లో పమిటచెంగుతో మూతి తుడుచుకొంటూ వచ్చేసింది గుండుచెంబుతో నీళ్ళు పట్టుకొని.

''అప్పుడే అయింది భోజనం?''

''ఆ''

''ఏంతిన్నట్టూ?''

''ఏదో'' నాఇష్టం.''

సరే, పో అని నేనూ ఆమె వెంటనే నడిచాను. గది ముందునడవలో పిల్లలు నిద్రపోతున్నారు. రోజూ, నాగదిలో ఉండే ఆమెమంచం ఇవ్వాళ బైటకొచ్చింది!! ఆమెగారు నీళ్ళ చెంబుబల్లమీద పెట్టేసి, దీపంతగ్గించి చటుక్కున పడుకొని ఊరుకొంది ముడుచుకొని మూడంకెలాగ. దగ్గరకువస్తేనా ఏదైనా మాటామంతీ చెప్పుకోవటం! బుసలు కొడుతుంటే!

''కాంతం!'' జవాబులేదు.

''అప్పుడే నిద్రా? ఇదిగో మాట.''

''ఇప్పుడేంమాట పడుకోండి''

''అయితేచూడూ నాకు నిద్ర రావటంలేదు. చదువుకొంటాను. కళ్ళజోడు ఎక్కడపెట్టావో చెప్పగలవా?''

''ఏమో?''

ఏమో అంటే ఎల్లాగ? ఉత్తమురాలైనభార్య ఇల్లాగనేప్రవర్తించాలిసింది? నావస్తువులన్నీ జాగ్రత్తపెట్టాలె. ఏవి...ఎక్కడ ఉన్నవీ తెలుసుకోవాలె''

''మీరు నావస్తువులు ఏవి ఎక్కడవున్నవో జాగ్రత్త పెట్టిచూస్తున్నారా? కాటికాయ కనపడక ప్రొద్దున నేను ఘంట వెతుక్కున్నాను'' అన్నది విసుగుతో.

''ప్రేమగా ఉండాలె కాంతం—చూశావా ప్రేమా అంటే.....''

''అంటే?''

''అంటే...నాహృదయం నీవు అర్థంచేసుకోవాలె. నాకు అన్నివిధాలా సాయపడాలె'' అన్నాను. అంతకంటె ఎక్కువగా నిర్వచనం చేయలేకపోయినాను.''

''నేను మీకు సాయపడనూలేను. మీరునాకు సాయపడనూలేరు. ప్రొద్దున మీకు నిద్రలేచేసరికి ఇడ్డెనలు వండిపెడదామని మినప్పిండిరుబ్బి, రుబ్బి చేతులు పడిపోయినాయి. నాకెవరుసాయంచేశారూ? ఏమిటో! ''ఎవరికివారే యమునా తీరే?'' అన్నది వేదాంతఫక్కీలో మాటలుసాగదీస్తూ. ఆధోరణిలోదిగిందో. ఆప్రవాహం ఇక మళ్ళదు.

''కాంతం'' అని పెద్దగాపిలిచాను.

''చాల్లెద్దురూ!'' అన్నది విసిరికొట్టినట్టు.

''ఇప్పుడూ......ఇంతకూ...ప్రొద్దున నేను'కాదు'

అని అన్నమాటకే కాదూ ఈకోపం అంతా. పోనీ నీవే చెప్పు. పిల్లలూ మనమూ హాంపీ వెళ్ళటం అంటే ఎంత శ్రమో!! ఎంత ఖర్చో!! నిజమా అబద్ధమా?'' అంటూ ముఖకొన్ని స్ఫురించాను.

"అయితే ఆయింది నేనూ వస్తాను'' అన్నది. కంఠస్వరాన్ని బట్టి ఆమె కొంత శాంతించిందని తెలుస్తునే ఉంది.

"నీవు వస్తానూ, అని అంటావే కానీ ఈసంసారం అంతా?''

"సంసారం, సంసారం, అనబోకండి మాటిమాటికీ, అదేదో పెద్దబరువులాగ.'' అని విసుక్కుంది.

"అయితే రాకతప్పదన్నమాట!''

"మీరు వెళ్ళటం తప్పకపోతే!''

ఇకఆవిడతో వాదించి లాభంలేదని తోచింది. కట్టు దలరానేరాదు ఆవిడికు. వచ్చిందో యమపట్టు. తీరిగ్గా ఏదో ఉపాయం ఆలోచించవచ్చునని అప్పటికి ఊరుకొన్నాను. ఆకాశంలో మబ్బులు విడిపోతున్నాయి. కొద్దిగా వెన్నెలవస్తున్నది. ఆమె పెదవులలోనుంచి చిరునవ్వు వెండుస్తున్నది. నాకూ కొంచెం ధైర్యం కలిగి ఆమె పక్కలో ఆనుకొని కూర్చుని ఆరంభించాను.

'ఒక్క సంగతి వింటావా!'

'ఏమిటి విశేషం!'

'చివరంటా విను, తరువాత నీఇష్టం.'

'ఆ చెప్పండీ ఏమిటో? అంటూ లేచి కూర్చున్నది. ఆమాత్రం దేవీప్రసన్నత చాలు ఇంక భయం లేదు. ఏదో విధంగా న్యాయ జేయ లేకపోతానా అన్న ధీమా కలిగింది.

'తాంబూలం ఇచ్చావు కావేం ఇవ్వాళ?'

'మీరు నన్ను అడిగారా?'

'రోజూ అడిగి తీసుకుంటున్నానా?'

'అడగంది అమ్మ అయినా పెట్టదు?'

'అమ్మ విషయంలో అంతేనేమో కాని. పెళ్ళాం అయిన మనిషి అడగకుండానే, పెట్టాలె. అల్లాగ భర్తకు కావలసినవన్నీ ఇస్తూ, భర్తృసేవా పరాయణురాలైన స్త్రీలే పతివ్రతలు అడక్కుండా, భర్తకు ఎన్నో వస్తువులు ఇచ్చినట్లు నిదర్శనాలు ఉన్నాయి పురాణాల్లో !! తెలిసిందా?'

'పురాణాల్లోనా?' అన్నది ఆవిడ ఎంతో సందేహిస్తున్నదానివలె, ఆ మాట నొక్కి నొక్కి పలుకుతూ.

'నేనూ, గట్టిగా నొక్కి పలుకుతూ పురాణాల్లో కావాలంటే ఒకటి, రెండు నిదర్శనాలు నీకు చూపగలను , సరా?, అన్నాను.

'అన్నీ చూపారు లెండి' అన్నది ఈసడింపుతో'

అల్లాగేం? అరుంధతి ఉంది చూశావూ అరుంధతి !! ఆవిడ ఏం జేసింది అనుకొన్నావూ?

'ఆ, ఏం జేసిందే?' అంటూ మా ఆవిడ నాపై తమలపాకుల ఈనె విసరింది.

'ఏమి చేసిందంటే ......చెపుతా...... ఒకసూరు ఆవిడ భర్తా.........ఆవిడ భర్త ఎవరు చెపుమా ! వెధవ జ్ఞాపకశక్తి ఇల్లాగ ఏడుస్తున్నది!' అని విసుక్కున్నాను.

తనకు మహా తెలిసినట్లే నవ్వింది ఆవిడ నవ్వి ఆమె భర్తా అండీ? ఆమెభర్త ఒకముని. అని తకీమని చెప్పేసింది.

ఆయనే ఆయనే ఆమునీ ఒకరోజున ప్రాతఃకాలము ననే స్నాన సంధ్యాదికృత్యముల నిర్వహించి...'

'నిర్వహించి, సహించి ధైర్యము వహించి! !...... చాల్లేండి ఊరుకోండి, మీ కవిత్వమూ, మీరూనూ!''

'మరి అల్లాగే, అడ్డం రావటం? చివరంటూ చెప్పనిస్తావా? వింటానని వాగ్దానం చేశావు జ్ఞాపకం ఉందా?'

'మరచిపోలేదు. పొరపాటున వింటానూ అన్నాను. బుద్ధిలేక అన్నాను క్షమించండి.'

'క్షమించటాలు లేవు - వినాలిసిందే.'

'వినాలిసిందే? కానీండి ఇదొక రకం శిక్ష'

'ఏమైనాఅనుకో. విను మరిప్రాతఃకాలకృత్యములునిర్వహించి, ఆపళంగా అడవికి పోయి పెద్ద ప్రొద్దుతపస్సుచేసెను.

'ఏమిటీ వాలకం? ఇప్పుడో పురాణకాలక్షేపమా!నాకు నిద్రవస్తోంది మీ కేం! ఎంతసేపైన మేల్కొనగలరు! కానీండి

'విను మరీ, తపస్సుచేసి ఆముని ఇంటికి వచ్చేశాడు.'

'మహా గొప్పపనిజేశాడు. ఇంటికొచ్చి భోజనంచేశాడుఅంతేనా!

'కాదు కాదు, అంతశీఘ్రంగా భోజనం చేస్తే...ఆమె పాతివ్రత్యం ఏమి కనబడుతుందీ. నేను చెబుతానన్న విషయం ప్రాతివ్రత్యాన్ని గురించి కాదూ!

'కానీండి తొందరగా'

'ఆ ఘోరతపస్సువలన ఆయన శరీరం వేడెక్కి ఆయనకుఎక్కువగా దాహం అయింది. కాని దాహం అని ఆయనఅడగనూలేదు. చేత్తో సంజ్ఞ చేయనూ లేదు. అరుంధతి ఆయనకు దాహం అవుతూన్న దన్నసంగతి గ్రహించి, అమృతంలాంటి చల్లటినీరు కమండలంలో పోసి తాగమంది చూశావా, అల్లాగ......భార్య భర్తకు అడగకుండా ఎన్నో సపర్యలుచేయాలె. ఇప్పుడు ఈ వెధవ తమలపాకులకోసం నేను నోరు జేసుకోని అడగాలేం!' అన్నాను.

'ఏమి కల్పనండి! ఇవిగో తమలపాకులు.'

అని చుట్టిన చిలకలు నాకు అందిచ్చింది. అదివరకే నోట్లోవక్కలున్నాయి. తమలపాకులు వెళ్ళి పోయినాయి నోట్లోకి నములుతూ మళ్ళీ ప్రారంభించాను.

౪

సరే, ఇప్పుడు అసలు సంగతికి వస్తాను. ఇప్పుడు నేను హంపీ...వెళ్ళినా, నీవు వస్తానన్నా అక్కడి తమాషాలు చూద్దామనే కదా?'

'ఆ, కాదు. అవునా. కాదా?'

'సరే కానీండి' అన్నది. అవునని కానీ కాదని కానీ అనదేఆవిడ! ఎల్లా అంటే ఏమి ఒప్పుకొన్నట్లు అవుతుందోనని ఆమె భయం. అంత తెలివిగలది ఆవిడ. నేను మళ్ళీ మొదలుపెట్టి,

'ఇప్పుడు నేను వెళ్ళుతాను హంపీ, వెళ్ళి......'
'తిరిగివస్తారు. ఇక్కడ నేను బిక్కు బిక్కుమంటూ కూర్చోవాలె. మీరు హాయిగా హంపీలో తమాషాలన్నీ చూస్తూ ఉంటారు! అంతేకాదూ?'

'అల్లాగ......ఆశుకవిత్వం అల్లేస్తే ఎల్లాగ చెప్పూ? కొంచెం ఓపికపట్టి వింటే సంగతంతా మనవి చేస్తాను'

'మీరు లక్ష చెప్పండీ......మీతో నేను ప్రయాణంకాక మానను.'

'అల్లా అనబోకు. నీవు రాకుండా...అక్కడి తమాషాలన్నీ నీవు చూచేలాగున నేను చేస్తాను. సరేనా?'

'ఏం జేస్తారూ? బొమ్మలు చూపిస్తారా?'

'బొమ్మలు చూపించడమే కాకుండా, ప్రతి భవనాన్ని గురించీ, ప్రతి దేవాలయాన్ని గురించీ నీకు చక్కగా వర్ణించి చెబుతాను. దేవాలయం ఎంత ఎత్తో, ఎంత విశాలమో, ఎన్ని గోపురాలున్నవో, అక్కడి శిల్పవైభవం ఎటువంటిదో అంతా చక్కగా వర్ణిస్తాను. దారిలో రైలుప్రయాణం, కొండలమీదుగా వెళ్ళటమూ, కొండలలోనుంచి త్రవ్విన సొరంగాలలో నుంచి రైలు జర్రున పాములాగ పరుగెత్తటమూ

మొదలైన ప్రతివిషయమూ నేను చక్కగా వర్ణించి చెప్తాను సరేనా?

ఆ నవ్వుతూఉన్న మా ఆవిడముఖం చూచి నాకు మళ్ళీ అఖండమైన జయం కలిగిందని మహా ఆనందం కలిగింది. కృష్ణదేవరాయల తూర్పు పడమరల దిగ్విజయాలే జయాలు. నా భార్యపైన నాకు కలిగిన అఖండ జయాలే జయాలు!! కాని నా అఖండ జయాల్ని గురించి మాత్రం కీర్తించే వంది మాగధులూ లేరు. కవులూ లేరు. కాని జయం మాత్రం అఖండమైంది.

ఆవిడ నవ్వి అన్నదీ, 'సరే. అల్లాగే. మీరు వెళ్ళిచూచివచ్చి, వర్ణించి నన్ను సంతోషపెట్టండి. నేనూ ఆ పద్ధతినే అవలంబిస్తాను. మీకు మట్టుకు అన్నం పెట్టను. పిల్లలూ నేనూ వండుకు తింటాము. కూరలూ పచ్చళ్ళూ పిండివంటలతోసహా భోజనం చేస్తాము మీకు వాటిని గురించి వర్ణించి చెబుతాను. మెత్తగా రుబ్బిన పిండితో, నేతితో వండిన గారెలు కరకర తిన్నామనీ, నేతిలో వేయించిన బంగాళా దుంపలు కూరా అవీ, తిన్నామని చెబుతాను! అల్లాగే పచ్చళ్ళూ, వాటి రుచులూ, రంగూ, కమ్మదనమూ, సువాసనా, అన్నిటినీగురించి వర్ణించి చెబుతాను. మీరు మట్టుకు పస్తు పడుకోండి' అన్నది.

పొడిచింది ఓపోటు! ఎల్లాగ దీనికి సమాధానం? కాకపోతే మొండిగా వెడతానని బయలుదేరాలె. బయలుదేరానో ఒక పెద్ద గుడ్డలమూట అయిదు పెట్టెలూ ఆముదపుసీసా

బయటపడ్డవన్నమాట ! అల్లాగ చేయటం తెలివి తక్కువ తనం కాబట్టి,

'కాంతం అల్లాగే అనటం? పతివ్రతలు అల్లాగా అంటారా చెప్పు కాంతం ?'

'ఎందుకనరూ ?'

'నీకు పురాణాలు సరిగ్గా తెలియవు...... నారదుడి మాట విన్నావుగదా ?'

'వినకపోవాలిసిందే !?'

'విన్నావుగదా. ఆయన పెళ్ళాం ఏంజేసిందో తెలుసునా ? ఆయన త్రిలోకసంచారి. అంటే తన ఇష్టం వచ్చిన దేశానికల్లా వెళ్ళివస్తుండేవాడు ఇల్లాగ దేశ దిమ్మరి అయి, అమరపురమూ బ్రహ్మపురమూ మొదలైన గొప్పగొప్ప పురాలకూ, దేవేంద్ర, భూలోక సువర్లోక స్వర్గలోకాలకూ, ఆయన తరచు వెడుతూఉండేవాడు. ఆయన భార్య ఒక్కసారి అయినా, రొసరొసలాడటం కాని నేను వస్తాననిఅనటం కానీ అన్నదనుకొన్నావా ? లేదు ! ఎప్పుడూ ఒక్కసారి అయినా ఆమె అల్లాగ అన్నది కాదు !! అల్లాగ మహాపతివ్రతలాగ ఉండాలె నీవు. తెలిసిందా ?

'అవునవును చాల్లెండి, మీకల్పనా మీరున్నూ...అసలునారదుడికిభార్య లేదంటారే?'

'ఎవరు చెప్పారు నీకు?'

'ఎవరు చెప్పేదేమిటి? నాకు తెలియదా? మొన్నగుళ్ళోమాఘపురాణం చదువుతూ ఉన్నప్పుడుకూడా ఆమాటే విన్నాను.'

'ఇంతేకదా మాఘపురాణం వ్రాసేకాలం నాటికి ఆయనకువివాహం కాలేదు. దాని తరువాత మత్స్య, కూర్మవరాహాదిపురాణాలువ్రాసారు. వాటిలో ఆయనభార్యసంగతిఅంతా ఉంది. ఈ సంగతి మొన్నమొన్నే కనిపెట్టారు. ఆయనభార్యపేరు మత్స్యగంధి అని కూడా తెలుసుకున్నారు.'

'ఛా ఛా ఊరుకోండి ? మీకవిత్వమూ మీరూనూ!!'

'పోనీ, అటువంటి పతివ్రతలు లేరంటావా?'

'ఎటువంటి ?'

'అల్లాగ పతి ఎక్కడికైనా, ప్రయాణం, అయిపోతుంటే వెంటపడి వస్తానూ అని అనని వాళ్ళు.'

'ఉహు.'

'అల్లా అననివాళ్ళు లేరు.'

'లేరూ? ఎవ్వరూ లేరూ.'

'లేరు. ఎవ్వరూ లేరు.' అని నదురు చెదురూ లేకుండాఅన్నది.

'పోనీ' ద్రౌపది పతివ్రతేనా? ఆమె ఏమి చేసింది? అర్జునుడు ఏదో గుర్రాన్ని తీసుకొని దేశాలమీదికిపోతే ఇంట్లో పడుందా లేదా? లక్ష్మణునిభార్య ఊర్మిళ పన్నెండు ఏండ్లూ ఇంట్లోనే పడుండి నిద్రపోయిందా ? మరి అదీ సంగతి ''

'ఊరుకోండీ. ఒక్క సంగతిమీకు తెలియదు. శ్రీరాముని వెంట బడి సీత అడవులకు వెళ్ళిందా? సావిత్రి మొగుడి వెంట బడి యమలోకందాకా వెళ్ళిందా? చూశారా. గొప్ప గొప్ప పతివ్రతలంతా అంతే! భర్తనువదలి ఒక్క నిమిషం ఉండరు.

'సరే ఏం జేస్తాము! నీమాటే నిజమని ఒప్పుకొంటాము. ఇంకోవిషయం ఏమిటంటే నువ్వు వాళ్లకంటే కూడా గొప్ప దానివి!!'

'నేనేం' గొప్పదాన్ని...అని అనటంలేదు' అన్నది కాంతం మూతి ముడుచుకొని.

'అ! హ! హ! హ!! నీవునిజంగావాళ్లందరికంటెకూడా చాలా గొప్పదానివి!! వాళ్ళు మొగుడివెంటఒంటరిగా పడ్డారు నీవుఅయిదుగురు పిల్లలతో వెంటబడుతున్నావు!!'

అవును, నేనూమహాపతివ్రతనే' అన్నది అమిత పెంకెగా



అంతే చివర సంగతిచెప్పేస్తాను. మా భార్యగారి మహాపతివ్రతామహత్యంవల్లనాప్రయాణం ఆగిపోయింది......

# బద్ నసీహత్

"ఇవ్వాళ ఇంత పెందరాళే వచ్చేశారేం" అంటూ మాఆవిడ నా కెదురుగా వచ్చి తలుపు తీసింది.

"యకాయకీని వచ్చేశాను" అంటూ లోపలికి అడుగు పెట్టి "కాఫీ ఏమైనా ఉందా" అని అడిగాను.

"ఆ, ఉంది. రెడీగా ఉంది. మరేం, మీకోసం ఎవరో పెద్దమనిషి వచ్చారు. పైన ఆఫీసుగదిలో కూర్చున్నారు ఆమటా అని" చెప్పింది మా ఆవిడ.

సరే ననుకొని, నేను గదిలోకి పోయి, కోటూ చొక్కా విడిచి, ముఖం కడుక్కొని, లుంగీ కట్టుకొని, పైన తువాలా వేసికొని, పైకెళ్ళాను వచ్చిందెవరో చూద్దామని.

ఆ కూర్చున్న పెద్దమనిషి కాస్త వయస్సుమళ్ళినవాడు లాగున్నాడు. ఉంటే యాభై ఏండ్లు ఉండవచ్చు. కాని శరీరం ముడతలుపడ్డ ముసలి కాదు. యౌవన శేషం యింకా అతని అవయవాల్లో కొద్దికొద్దిగా కనిపిస్తూ ఉంది. మనిషి అమాయకుడులాగా చాలా సౌమ్యుడులాగా కనిపించాడు.

నన్ను చూసేచూడ్డంతోటే ఆయన లేచి నమస్కారంచేశాడు. "తమరు ఎవరో నాకు జ్ఞాపకం లేదండీ, క్షమించాలె" అన్నాను నేను.

ఆయన కుర్చీలో కూర్చుంటూ అన్నాడూ—"అయ్యా మీకు నేను పరిచయుణ్ణి కాను, నన్ను మీ రెప్పుడూ చూడనూ లేదు. మాది అసలు విజయనగరం. నా పేరు సన్యాసిరాజు. మేము రాజుపేటలో కాపురం ఉన్నాము. తమ దర్శనార్థమై వచ్చాను" అని.

"అయ్యో, అంత పెద్దమాట ఎందుకండీ, నేనెంతటి వాణ్ణి" అన్నాను నేను నవ్వుతూ.

"అల్లా కాదండోయ్, తమకు మా ప్రాంతాల్లో మా చెడ్డ పేరుందండోయ్" అన్నాడు ఆయన తమాషా విజయనగరం యాసతో.

"చెడ్డపేరేమండీ?" అన్నా నేను వింతగా చూస్తూ.

నేను ఇల్లాగ అనటం జూచి ఆయన నొచ్చుకొని "క్షమించాలండి. చెడ్డపేరూ అంటే మహాదొడ్డ పేరుందని మనవి చేస్తున్నాను" అన్నాడు.

"అల్లాగనాండీ" అని ఒక చిరునవ్వు నవ్వి నేనూరుకొన్నాను. ఆయనమళ్ళీ ఇల్లాగ అన్నాడు: "తమ కథలూ గట్రా చదివి మేము ఊ ఆనందిస్తూ ఉంటామండి. మా చెడ్డ తమాషాగా ఉంటాయి సుమండీ"

ఈ మాటలువిని, సంతోషించి, నేను ఊరుకొన్నాను. ఓ నిమిషం అయినతరువాత ఆయన నావంక జూస్తూ మళ్ళీ అన్నాడూ—"తమర్ని తమ కాంతాన్ని, తమసంతానాన్ని చూచి ఆనందించాలనే ఉద్దేశంతో ఇల్లా వెళ్ళిపోవచ్చానండీ" అని.

“ఏదో తమకు మాయందు అల్లాగ అభిమానం కలిగింది” అని నేను అంటూ ఉండగానే ఆవిడగారు వచ్చింది, వెండిపళ్ళెంలో నాల్గు కాల్చి నెయ్యిరాసిన అప్పడాలు పెట్టుకొని, చేత్తో ఫ్లాస్కు పట్టుకొనీ. ఆవిడను చూడటంతోనే నేనన్నానూ—“అదిగో రానే వచ్చారు. ఆవిడేనండి కాంతాయమ్మారావుగారు” అని.

సంతోషం, ఆశ్చర్యం కనపరుస్తూ ఆ పెద్దమనిషి లేచినిలబడి. “ఓహో, తమరేనా అమ్మా. సీతా అనసూయా చూశారూ, అల్లాంటి కోవలోనివారు తమరు” అంటూకూర్చున్నాడు.

కాంతం ఒక్క క్షణం విచిత్రంగా చూచి, “బాబుగారూ, నన్నంతగా పెద్దచేయటం కేవలంమీకు మాయందుండే అభిమానం తప్ప మరోటికాదు...ఇల్లా దయచేయండి, ఫలహారం పుచ్చుకోండి” అని ఆ పళ్ళెంలోనుంచి రెండుఅప్పడాలుతీసి నాచేతికిచ్చి ‘మిగిలిన రెండు అప్పడాలతో పళ్ళెం ఆయన ముందుపెట్టింది. మేమిద్దరం అప్పడాలు కరకరా నమిలేసి, చెరోకప్పు కాఫీ తాగుతున్నాము.

ఇంతలో నే నన్నానూ—“మా కాంతంమహా యోగ్యురాలండి ఆ మహాఇల్లాలియొక్క యోగ్యతవల్లనే మాకుటుంబానికి ఏలోటూ లేకుండా జరుగుతున్నది” అని. మరేంటండీ, ఆ మహాఇల్లాలి పాతివ్రత్య మహత్యం చేతనే మాకు ఇంత సిరీ సంపదా ఏర్పడ్డవి. మరిసందేహం లేదండీ” అని అన్నాడు ఆయన.

"ఇంకొంచెం కాఫీఅండీ" అన్నది కాంతం, ఆయనను ఉద్దేశించి. ఆయన అక్కర లేదన్నాడు. మరోక్షణం అయినత రువాత "పిల్లలు స్కూలునుంచి వచ్చేవేళైందండి, నేను సెలవ పుచ్చుకుంటానండీ బాబుగారూ" అని చెప్పి కాంతం మేడమెట్లు దిగివెళ్ళి పోయింది.

ఫలహారంకూడా అయిపోయింది. ఇంట్లో ఉడక పోస్తు న్నది. బైటికి ఎక్కడికైనా వెడితే బాగుండునూ అని అని పించింది నాకు కాని ఆ పెద్దమనిషితో ఏంచెప్పాలో తెలియక కూర్చుని, రెండునిమిషాలైనతరువాత నేనే అన్నానూ—తమరేమైనా పనిమీద వచ్చినట్లా అండీ" అని.

"ఎబ్బెబ్బే వృత్తి నేవచ్చానండీ, మరేం పెద్దపనీలేదూ... అని ఆవాక్యంపూర్తి చేయకుండానె ఉండిపోయినాడు ఆయన.

ఇల్లాంటి పెద్దమనుష్యులతో చాలా బాధ. వాళ్ళువచ్చిన పనేదో చెప్పనూ చెప్పరూ, మనలను పోనీయనూ పోనియరూ ఎంతసేపూ అల్లాగచూస్తూ కూర్చుంటారు. అందుకనే నేను మళ్ళీ అన్నాను—"చెప్పండి, ఏదైనా పనుంటే; సందేహి స్తున్నట్టున్నారు. చేయగలసాయం ఏమైనాఉంటే చూస్తాను" అని. ఆయన అప్పటికీ మాట్లాడలేదు! జవాబుకోసం కాసేపు నిరీక్షించాను. టైము చూశాను. అఁహఁ, ఎన్నిచేసినా ఆయన నోట్లోనుంచి మాట పెగల్లేదు.

సాధారణంగా నాకోసం వచ్చేవాళ్ళు రెండురకాలుగా ఉంటారు. 'కథ ఏమైనా వ్రాసి మాపత్రికకు ఇవ్వండి' అని

అడిగేపత్రికాధిపతులు ఒకరకం. ఈయన వాలకం చూస్తే ఆరకంమనిషి కాదని తెలుస్తూనే ఉంది. అది కాకపోతే 'మా అబ్బాయికి నాలుగు మార్కులు వేసి ప్యాసుచేయించండీ'' అంటూ వచ్చేది రెండోరకం.

ఈపెద్దమనిషి ఆ రెండోరకంవాడు అయిఉంటాడని తోచింది. నిజంగా అంతే అయి ఉంటుందిలేకపోతే అంతసేపు నీళ్ళు నమలటానికి అవసరం ఏముంటుందీ అనుకొని, 'అయితేతమకు పిల్లలెంతమంది బాబూ' అన్నాను. 'అయిదుగురండీ' అన్నాడు ఆయన 'ఉహూ, అయితే తమ పెద్ద అబ్బాయి ఏక్లాసూ?' అన్నాను, సంగతేదో తెలుసుకొని చెప్పాలిసిన మామూలుమాటలు చెప్పి తొందరగాపంపిద్దామని ఆయన కొంచెం విచారంగా అన్నాడు—'నాకు మొగపిల్లలు లేరండీ, అయిదుగురూ ఆడపిల్లలేనండీ' అని.

ఈజవాబు విన్న తరువాత ఆయన ఎందుకొచ్చాడూ అన్నప్రశ్న మరీ క్లిష్టమైపోయింది. నిర్మొగమాటంగా 'అయితేమరి సెలవు' అని చెప్పి పంపివేయటానికి మనస్సు ఒప్పలేదు పిల్లల పెండ్లిళ్ళవిషయంలోకూడా మాష్టర్ల సహాయాన్ని ఇల్లాంటి పెద్దమనుష్యులు అపేక్షిస్తూ ఉండటం కద్దు. ఒకవేళ అల్లాంటి పనిమీద ఏమైనా వచ్చాడేమోనని, పిల్లల పెండ్లిళ్ళుఅయినాయా అండీ' అని కుశలప్రశ్న వేశాను.

'ఆ, పెద్దపిల్లలుముగ్గురి పెండ్లీ అయిందివాళ్ళు కాపరానికి కూడా వెళ్ళారు. మిగిలిన ఇద్దరికీ సంబంధాలు సిద్ధంగానేఉన్నా

యండీ, మీదయవల్లా'' అన్నారు. ఇక ఇల్లాంటి పిచ్చిప్రశ్నలతో కాలంగడపటానికిఇష్టంలేక, కుర్చీలోనుంచిలేస్తూ ''చిత్తం అల్లాగ వెళ్ళాలిసిన పనుందండి. మళ్ళీఎప్పుడైనతమ దర్శనం చేస్తాను'' అన్నాను.

ఆయన తెల్లపోయి ''చిత్తం, చిత్తం, అల్లాగే నండి కాని, ఒక్కచిన్నవిషయంలో తమ సలహాకావాలని వచ్చాను'' అన్నాడు.

''అల్లాంటి దేమైనా ఉంటే చెప్పండిమరి'' అనినిలబడి పోయినాను.

''మరేంలేదండీ. చూశారూ, తమరు కథల్లో సంసారాన్ని స్వర్గధామంగా వర్ణించారు ''అంటూ మొదలుపెట్టాడు. నాకథలుమెచ్చుకుంటున్నాడు కాబట్టి నేనుకూర్చోక తప్పింది కాదు.

మళ్ళీ అన్నాడు ఆయన—''ఘోటకబ్రహ్మచారులకైనా కాంతంకథలు చదివినమీదట పెండ్లాడాలని బుద్ధి పుడుతుంది'' అని.

'మీకుపూర్తిగానాయందుఅభిమానం' అన్నాను నేను.

అల్లాకాదండోయ్. ముఖ ప్రీతికోసం అంటూన్న మాటలు కావండయ్యా...'సంసారం సాగరం దుఃఖం, అన్న మాటలు వ్యర్థపడాలని అని పించారు తమరు'' అంటూఆయన నన్ను మెచ్చుకొన్నాడు.

నేనూ సంతోషించి ''అయితేతమరేదో చిన్నపనిమీద వచ్చారన్నారూ!'' అన్నాను. ఆతురతతో.

"చిత్తం చిత్తం, మనవిచేస్తా. నాకూ పెండ్లాంబిడ్డలూ ఉన్నారండి. ! నాకుఇల్లు జూస్తే నరకకూపంలా ఉందండి !!! పిల్లలు చూద్దామా, అల్లరీ! పెళ్ళాంచూద్దామా, గయ్యాళీ ! నేనూ ఆమె కజ్జా ఆడనిరోజు లేదండి. ప్రతి రోజూనూ ఏదోఒక విషయమై తగాయిదా వస్తూనే ఉంటుం దండి" అంటూ ఆయన కళ్ళు తేలేసి చూడటం మొదలు పెట్టాడు.

"అయితే...నన్నేమి చేయమంటారూ"

అన్నా నేను నవ్వుతూ.

"తమరు మాకు ఏదైనా ఓతరుణోపాయం చూపెట్టా లె. ఎల్లాగ ప్రవర్తించాలో, సాంసారిక జీవనం సుఖప్రదం కావటానికి రహస్యం ఏమిటో తమరు సెలవిస్తే తెలుసుకోం దామని కొండంతఆశతో తమదగ్గరికి వెళ్ళిపోవచ్చానండి. ఈవి షయంలో...కొద్దిగా,......నాకుమీరు ఉపదేశం చెయ్యా లె" అంటూ ఆ పెద్దమనిషి ప్రాధేయపడ్డాడు.

"ఉపదేశం చెయ్యటానికి ఇదేమన్నా వేదాంతమా మంత్రశాస్త్రమూ అండీ?" అన్నాను, నేనూ నవ్వుతూ. "మీరుఅల్లాగ అంటే కాదు బాబూ. ఏదో మార్గం చూపా" లంటూ ఆయన ఒక్కతీరున బలవంత పెట్టాడు.

ఆయనమాటతో నేయటానికివీల్లేకపోయింది సరే నాకు తోచినముక్కలుచెబుదాం. ఇందులో తప్పేముందీ అనుకొని "సరే, అసలుసంగతి...మీభార్యానుమీరు ప్రేమిస్తున్నారా'

అన్నాను. "అయ్యో, ప్రేమించకేమండీ, అయిదుగురు పిల్లల తండ్రినీ" అన్నాడు ఆయన "అయితే పోట్లాటలు ఎందుకొస్తయ్యా" అన్నా.

ఆ పెద్దమనిషి నావంక తెల్లపోయి చూచి, ఒక్కక్షణం ఆలోచించి "బాబూ, చూశారూ, ఇదీ కారణం అంటూ చెప్పలేనండీ. అసలు ఒకకారణం అంటూ ఉండదండీ! ఉత్తినే, జైమంటూ లేస్తుందండీ. నేను అవునుఅన్నదానికల్లా ఆమెగారు కాదు అంటుంది ఎల్లాగండీ!" అంటూ ఆయన చిట్లించుకొన్నాడు.

"అల్లా అయినట్లయితే మీరే ముందుగాకాదూ అనండీ అనిఅన్నాను నేను వేళాకోళంగా.

ఈమాట పాపం, ఆయనను కష్ట పెట్టింది. దీనంగా చూస్తూ అన్నాడు ఆయనా—"తమరుఅల్లాగ సెలవిస్తేగాదు. సిన్‌సియర్‌గా చెవుతున్నాను. ఈదిక్కుమాలిన పోట్లాటకు అంతులేకుండా ఉంది. తమరు... ఏదో...తరణోపాయం చెప్పాలె" అని.

ఆయన్ను చూస్తే నాకు జాలేసింది కాసేపుఆలోచించి చివరకు అన్నానూ— "అయితే సరే, ఒకచిన్న రహస్యం చెబుతాను వినండి. దాంతో మీకూ...మీకూ...పోట్లాటలు లేకుండా పోతవీ అని.

ఆయన, పాపం, ముఖం చేటంత చేసుకొని, 'అదేనండీ, అల్లాంటి చట్కారహస్యాలు చెబుతారనే...తమ దర్శ

నానికి వెళ్ళిపోవచ్చానండీ'' అన్నాడు. ''నేను చెప్పేదయినా అంత గొప్పవిషయం కాదు, స్వల్పవిషయమే అనుకోండి'' అంటూ నేను ప్రారంభించాను. తమరు చెప్పేవిషయ మున్న దిచూశారూ అది ఎప్పటికీ స్వల్పవిషయం కాదను కోండీ! సెలవియ్యండి'' అంటూ ఆయన కుర్చీని నాకు దగ్గరసా లాక్కొని అత్యంత శ్రద్ధతో వింటానికి తయారైనాడు.

నన్ను ఆరాధించేభక్తుడు ఇన్నాళ్లకు దొరికినందుకు నేనూ సంతోషిస్తూ, గొప్పస్త్రీవశీకరణ మంత్రాన్ని ఉపదేశిస్తున్న వాడిలాగ చూడండీ, మీవిషయంలో చెప్పదగిన రహస్యం ఏమిటీఅంటే...ఆవిడగారు అవును అన్నదానికి మీరెప్పుడూ కాదనబోకండి. మీభార్యగారు ఇది బాగుందీ అంటే మీరు బాగుంది, బాగుంది అని తాళంవెయ్యండి. ఆమెగారు దేన్నిచూచిఅయినా బాగుండలేదూ అన్నదామీరూ ఛీ, ఛీ ఏమీబాగుండలేదూ అనండి సంసారస్వర్గధామానికి ఇది ప్రథమసోపానం. తెలిసిందా అండీ? అన్నాను.

పాపం, ఆయన తల ఊపి చిత్తం, చిత్తం. అయితే బాబూ, కొన్నివిషయాల్లో చూడండీ, డబ్బ్యాగట్రా వాడేవిషయాల్లో ఆమెగారు చెప్పిన దానికల్లా, తలఊపితే సంసారం గడవదు. ఏమంటారు?' అన్నాడు.

''అవునండీ, ఆసంగతి నాకు తెలుసు మరీ...''

''అహహహహహ. తమకు తెలియదని కాదు. ఉట్టినే మనవిచేశాను'' అన్నాడు ఆయన ఎంతో నొచ్చుకుంటూ.

''ఇప్పుడు పండగా పబ్బంవచ్చిందా అంటే, మన తాహతు తెలుసుకోకుండా నేఇవికావాలె, ఇవికావాలెఅంటారు ఆడవాళ్ళు వాళ్ళు చెప్పిందానికల్లా మనం సరే అన్నామా అంటే అప్పుల పాలు కావలసిందే. అదేకదూ మీరనటం!'' అన్నాను నేను.

ఆబ్రాహ్మడు మరింత దగ్గరసా లాక్కుంటూ ''అద్దది బాబూ, అదీ అసలు సంగతి. వేధించుకు తింటూన్నదంటే నమ్మండీ! ఏం జేయమని సెలవు?'' అన్నాడు.

''ఇప్పుడేం జేస్తున్నారూ?'' అన్నా నేను.

''ఏంజేస్తున్నానూ, నాదగ్గర మదువులేదూ - నేను తీసుకురాలేనూ అని బుర్రనొక్కుంటాను బాబూ. మరేమిటి చేసేది. అని జవాబిచ్చాడు.

''అదే తప్పుపని'' అన్నా నేను ఠీవిగా, అధికారిలాగ ''మరేం జేయమనిసెలవు'' అంటూఆయన నమస్కరించాడు ఆయన అల్లాంటిభక్తి విశ్వాసాలు చూపటంమూలాన, నాకు తెలియకుండానే నాలో ఒక గర్వంతో కూడిన భావం పరుగెత్తింది.

ఇహ నేను మొదలు పెట్టాను భార్యావశీకరణసూత్రాన్ని ''చూశారూ, అల్లాంటి సమయాల్లో, భార్య కావాలన్న వస్తువులను తీసుకురానూ అని మీరెప్పుడూ అనకండి. విషయాన్ని మీకుఇప్పుడుసూత్రప్రాయంగాచెప్తానన్నమాట. అంటే, తెస్తానూ తెస్తానూఅంటూనే మనం ఆడవాళ్ళను బురిడీ

కొట్టించాలె. ఈవ్యాఖ్యానంతో తమకు బోధపడిందనుకుంటా. ఏమంటారు?''

ఈమాటలు ఆయన శ్రద్ధగా విని తనజన్మ తరించిందన్నంతసంతోషాన్ని పొందినట్లు చూశాడు. ''అదీగాకా ... ఆమెనులొంగతీసుకొంటే ఆమె ఎప్పుడూ మీఇష్టానికి వ్యతిరేకమైనకోరికలు కోరనేకోరదూ!'' అని మరొక మహత్తరమైన గుప్త రహస్యాన్నిగూడా బయలు పెట్టేశాను.

''అదే! అదేనండి! ఆలొంగదీసుకొనేది ఎల్లాగో తెలియకే! దాని కేదైన మార్గం సెలవియ్యాలె'' అని మళ్ళీ ఆయన ప్రాధేయపడ్డాడు.

రెండు కళ్ళనూ వేళ్ళతో నొక్కుకొన్నాను, ఒక్కక్షణం. తళుక్కుననాకళ్ళముందేదో మెరసినట్లు తోచింది. దీర్ఘతపోదీక్షానంతరం జ్ఞానసంపన్నుడైన తథాగతునిలాగ చూస్తూ అన్నాను. ''అల్లాఅయితే నే చెప్పినట్లుచేయండి. రోజుకుమూడుసార్లు...''

''ఏదైనా క్రియా అండీ?'' అన్నాడాయన గుడ్లు పత్తికాయలంత చేసి ఆశ్చర్యంగా చూస్తూ.

''చెబుతా...రోజుకు మూడుసార్లు...అంటే అధమపక్షం మూడుసార్లు అయినా భార్యను ముద్దుపెట్టుకోవాలె'' అన్నాను నిమీలితనేత్రాలతో.

ఈమాటలువినిఆయన, అరసౌన్సుఆముదంగుటుక్కున మింగినవాడిలాగా వికారంగాచూస్తూ ''నాకు నలభైఎనిమిదో.

ఏడండి! మా ఆవిడకు నలభై దాటిఉంటై! చికిత్సకు ఇల్లాంటిదికాక మరోరకం అనుపానం చెపటానికి...' అని ఏమో అనబోతుంటే, ఆయనను పూర్తిగా మాట్లాడనీయకుండానే నేనన్నానూ—"ఇటువంటి విషయాల్లో, చూశారూ, వయస్సుతోనిమిత్తం లేదు" అని.

"చిత్తం, సరే, అల్లాగే అనుకోండి అయితే...మా ముసలిదాన్ని రోజుకు మూడుసార్లు—అంటే...త్రికాలముల యందూ ముద్దు పెట్టుకోమని సెలవాండీ? అన్నాడు. నేను తప్ప దన్నట్లుగా తల ఊపాను.

కొంచెంసేపు తలవంచుకొని ఊరుకొని తరువాత మళ్ళీ అన్నాడూ—"చిత్తం, ఇంకా, ఎల్లాంటి ఎల్లాంటి పనులు చెయ్యాలో సెలవిచ్చే సెయ్యండీ" అని నిస్పృహతో.

"ముద్దుపెట్టుకోటం మొదటివిషయం. అది చెప్పానండీ! ఇక రెండోది. అధమపక్షం రోజుకు నాలుగైదు సార్లయినా, నిన్ను ప్రేమిస్తున్నా నిన్ను ప్రేమిస్తున్నాను అంటూ భర్తభార్యకు తెలియజెప్పాలె" అన్నాను.

"నే నెప్పుడూ, నా జన్మలో అల్లాంటి మాటలుఅని ఎరగనండీ" అని దీనంగా అంటూ ఆయన నావంక చూశాడు.

జాలి లేకుండా కఠినపథ్యం చెప్పేవైద్యుడిధోరణిలో "తప్పదండీ. నిష్కామకర్మ చెయ్యాలె. పోనీ, పాఠంలాగ ఒప్పజెప్పే సెయ్యండి" అంటూ పెదవి విరిచాను.

ఆయన కళ్ళు మూసుకొని, ధ్యానం చేసుకొని "అల్లాగేఇంకా" అన్నాడు.

14

అంతవరకూ తలొంచుకొని ఆలోచిస్తున్న నేను తలెత్తి "ఇంకా ఏమిటీ అంటే. ఆమె సుగుణాలను ఎక్కువగా పొగడండి, ఇల్లాంటిదీ అల్లాంటిదీ అంటూ" అన్నాను.

మెదలకుండా వింటూ కూర్చున్నాడాయన మరోనిమిషంఅయింది. "ఇంకా దేముడు మేలుచేస్తే ఆమె సౌందర్యాన్ని గురించికూడా ఎక్కువగా మెచ్చుకోండి...ఊఁ... అంతే...మరేంలేదు" అని చెప్పాల్సిన విషయాన్ని పూర్తి చేసినట్లుగా తల ఊపాను.

ఆయనకు నాయందు విశ్వాసము పూర్తిగా ఉంది. నేను చెప్పినట్లు ప్రవర్తించటానికి ఆయన నిశ్చయించుకోనూ నిశ్చయించుకొన్నాడు. కాని "పొగడటం నాకు అలవాటూ లేదు, తెలియనూ తెలియదు, మరి ఏమిటండీ కీలకం?" అని అయన నిట్టూర్పు విడిచాడు.

"తెలియటాని కేముందండీ? చూశారూ, ఆవిడ పేరేమన్నారూ?" అన్నాను.

"చంద్రమ్మగారూ "అన్నాడు.

"అయితే...మీరు ఆమెను చంద్రా అని...పిలుస్తారా?" ఎబ్బే, అసలు పేరుపెట్టి పిలవనండి"

"అవునులెండి. పేరుతో పిలవకూడదు కాబట్టి, జటాజూట శిరోమణీ అని పిలవండి."

"చిత్తం"

"పిల్చి ఆపళంగా పొగిడే సెయ్యండి. ముందుముఖం తీసుకోండి. 'నీముఖారవింద అవలోకితాపేక్ష......'"

"ఉండండి, ఉండండి, లాభంలేదు. కాస్త తగ్గుస్థాయిలో ఉండాలె. రాసుకోమని సెలవా!"

"అహా. పోనీ, ఇట్లాగ అనండి. 'నీశరీరం పదారువన్నె పసిమితో మిసమిసలాడుతూ ఉంది. నీమధురాధరం బింబఫలారుణిమను సేకరించుకొన్నది. నీనాసికా పుటాలు నువ్వుపువ్వులను పోలియున్నవి. తెలిసిందా? యేమంటారు? ఈధోరణిలో వెళ్ళిపోండి. ఆమె సౌందర్యాన్ని వర్ణించటానికిమీకు మాటలు దొరక్కపోతే మనుచరిత్రో పారిజాతాపహరణమో తిరగెయ్యండి." అని సలహా చెప్పాను.

నామాటలన్నీ విని బిక్కముఖంతో ఆయన సెలవు అని వెళ్ళిపోయినాడు.

౨

ఆయన మేడమెట్లు దిగి వెళ్ళిపోవటంతోనే మా కాంతం వచ్చి నాఎదట నిలబడి చురచురా చూస్తూ "పాపం, పెద్దవాణ్ని పట్టుకొని ఏమిటా వేళాకోళం?" అన్నది. నిజానికి ఆయనను వేళాకోళం చేయాలని నాకు ఏకోశానా లేదు నేను సిన్సియర్‌గానే చెప్పాను.

"లేదు కాంతం! నేను వెక్కిరింతకూ, వేళాకోళానికీ అన్నమాటలుకావు అవి అట్లా ప్రవర్తిస్తే గృహకలహాలు ఎప్పు

డూ ఉండవని నానమ్మకం. నేను అల్లాగ ప్రవర్తిస్తున్నానా... నేజేస్తున్నపనినే ఇంకొకర్ని చేయమన్నాను. ఇందులో నేను ఒకరిని ఫూల్ చేసిం దెక్కడా!" అన్నాను.

"అయితే మీరు చేసే పిచ్చిచేష్ట లన్నింటినీ అందరినీ చేయమంటా రేంఖర్మం! నే కాంగాభరించి ఊరుకొంటున్నా గాని ఏఇల్లాలు ఊరుకొంటుందండీ" అంటూఆమె నవ్వసాగింది.

"నీవు పొరపడుతున్నావు. భర్తఅల్లాగ ప్రవర్తించడం భార్యఅయిన ప్రతిస్త్రీకి ఇష్టమే. ఇప్పుడు నేజెప్పినదంతా కూడాఅనుభవంమీద ఆధారపడి ఉంది. అంతేకాకుండాఒప్పుకొన్నదే. పొగిడితే ఎంతవాడైనా మెత్తపడతాడు. ఇక ఆడదానిమాట చెప్పక్కర్లేదు. ఏమంటావు?"

కాంతం ఏమీ మాట్లాడలేదు. ఆమెగారికి నామాటలయందు ఏమీ విశ్వాస మున్నట్లు కనపడలేదు. అందుకని మళ్ళీఅన్నాను..."నీకు తెలియదు. చాలాపరమరహస్యాలను ఆయనకుబోధించాను. చూస్తావుగా, ఇంకోవారంరోజులకు ఆయనమళ్ళీ నాదగ్గరకొచ్చి బాబూ, మీదయవల్ల నాకష్టాలు గట్టెక్కినై మాభార్యాభర్తలమధ్య పోట్లాటలు అంతరించినై, స్వర్గసౌఖ్యం అనుభవిస్తున్నాము అంటూ చెప్పకపోతేనా" అన్నాను గర్వంగా.

"అయ్యో! అయ్యో!" అంటూ నాఆవిడనూతీ ముక్కు విరిచింది పతాకహస్తాన్ని అధోముఖంగా పెట్టిఅటూ ఇటూ ఆడిస్తూ.

ఆవిడ అల్లాగ అన్నా నాకుమటుకు తృప్తిగానేఉంది. నిజానికి నేను ఏంజేశానూ! భార్యను కొట్టమనలేదు. తిట్ట మనలేదు; భార్యను ముద్దెట్టుకోమన్నాను. ఇందులో తప్పు ఏమిటో నాకు తోచలేదు. అయినా ఆవిడ అల్లాగ విరుపుగా మాట్లాడటం నాకు కష్టమేసింది.

అంగుకని కాంతాన్ని పిలిచి మళ్ళీ అన్నానూ "చూడూ, నేచెప్పిందాంట్లో తప్పు ఏమీలేదు. తప్పు అనిఎవరు అంటారో అనమను. నీవు ఒక్కదానిని బయలుదేరావు ఇవి పిచ్చిచేష్టలని చెప్పటానికి అదీగాక ఇవి నీకుతెలియని విషయాలు. వీటిని సైకలాజికల్ ఎక్సెపెరిమెంట్సు అంటారు. మనస్సులో అద్భుతమైన మార్పులు వస్తవి" అని ఆవిడకు నామనస్థితిని విపులంగాచెప్పాను.

అప్పటికి ఆవిడ కేమాత్రం నమ్మకం కలుగలేదుగాని నేనుమాత్రం, ఒక్క కుటుంబాన్ని గృహచ్ఛిద్రపంకంలో నుంచి పైకెత్తగలిగాననీ, నరకసదృశ్యమైన ఒకప్రదేశాన్ని స్వర్గఖండంగా మార్చగలిగాననీ, ఒక దంపతిపూజ చేయగలిగానని, ఒకజోడు ఆత్మలకు తృప్తినీ, ఆనందాన్నీ ఇయ్యగలిగాననీ నాలోనేను ఉప్పొంగిపోయినాను.

ఆయన మళ్ళీ వచ్చి, తాను నే జెప్పినట్లు ప్రవర్తించి నమీాదట తనభార్యలో కలిగిన అద్భుతమైన మార్పునుగూర్చి నాకుచెప్పి కృతజ్ఞతతో నమస్కరిస్తాడని నాకు ఘట్టిన మ్మకం.కంటకపరివృతమైన తనజీవితపథము ఎట్లామృదుమనో

హార కుసుమవిరాజితమైందో, ఇతఃపూర్వం అపశ్రుతి రాగ కఠోరమైన వృద్ధదంపతుల జీవితరాగం ఇప్పుడు. ఎల్లాగ మనోహరైకశ్రుతిని మేళవించిందో, వికల శిలాశకలభయంకరమైన వారి కఠినజీవితశయ్య ఏరీతిని మృదుమనోహార సుమశయ్య అయిందో, కాకఘూకారవవ్యాకులమైన ఘోరజీవితకాంతారము ఎంత చిత్రంగా, శుకపిక కోకిలారవ నందనోద్యానంగా మారిందో, ఝంఝామారుతోద్ధూతోత్తుంగతరంగములచే చీకాకుపడిన తన సంసారసాగరం ఎల్లాగ వైకుంఠ వాసావాసవట పయఃశయ్యా పయఃపయోధిగా మారిందో ఆయన నోటితో ఆయనే చెపుతూఉంటే వినాలని నేను కుతూహలపడ్డాను.

అందుకని రోజూ సాయంత్రం స్కూలునుంచి రావటంతోనే ‘ఏం కాంతం, ఆయనేమన్నా వచ్చాడా’ అనేవాడ్ని ఆమెగారు ముక్కువిరిచి ‘ఇంకా రావలిసిందే’ అంటూ వెక్కిరించేది.

3

ఇల్లాగ నాలుగురోజులు గడచినై. అయిదోరోజున ప్రొద్దున్నే కాంతం నాదగ్గరకొచ్చి ‘మీకోసం ఎవరో అవ్వగారు వచ్చా’ రంటూ నన్ను నిద్రలేపింది. నేను కళ్ళు నలుపుకొంటూ లేచి క్రిందికెళ్ళాను. హాల్లోనుంచి వంటింటికిపోయే గుమ్మంలో నుంచుని ఉంది ఒకావిడ.

యాభై యేండ్ల వయస్సులో ఉన్న మనిషిలాగా కని పించింది ఆవిడ. శరీరం దబ్బపండుఛాయ. ముఖాన కానీ డ బ్బంత కుంకవుబొట్టుంది. మామిడిచిగురు జరీచీర కట్టుకొంది. కొప్పులో మందారపువ్వు ఉంది. కొద్దిగా, ముఖ్యంగా ముఖం పైన నెరిసింది. నలభై ఏండ్లక్రింద నన్ను భూమిమీద పడేసి వెళ్ళిపోయిన మాఅమ్మే మళ్ళీ మాఇంటి కొచ్చినట్లుంది.లో పల ఈమాతృమూర్తిని నమస్కరిస్తూ నిలుచున్నాను.

"ఈ ముసలమ్మగారే మీకోసంవచ్చారండీ" అన్నది కాంతం. "ఏమండీ పిన్నిగారూ" అన్నా నేను. ఆమెనన్ను జూచి "ఏంనాయనా, నువ్వేనా మా కాంతం మొగుడివీ"అంది

"నేనేనండీ" అన్నాను నవ్వుతూ.

"ఏంనాయనా, నీవు...మాఆయనకేదో ఉపదేశం చేశావుట కాదూ?" అన్నది ఆవిడ.

నేనేమిటి! ఉపదేశం చేయటమేమిటి! మీరు...నేను ఎవరని భ్రమపడుతున్నారోనూ" అన్నాను. కాదునాయనా నువ్వే చేశావుట" అన్నది ఆవిడ మళ్ళీనూ.

"నేకాదండీ పిన్నిగారూ, నేను ఇంగ్లీషు చదువుకొ న్నాను. నాకు మంత్రాలూ గింత్రాలూ రావండీ పిన్నిగారూ" అన్నాను.

ఆ ఇంగ్లీషుమంత్రాలే ఉపదేశించావుట. లేదంటావే మిటి. నువ్వే ! ...కాంతమ్మ మొగుడని ఆయన చెప్పారు కారూ?" అన్నది.

''మొన్న మీదగ్గరకు రాలేదూ, ఆయనండీ'' అని కాంతం ఎక్స్‌ప్లెయిన్ చేసింది.

అప్పుడు నేనన్నాను: ''ఓహో, అదా సంగతి ? పెద్ద ఉపదేశం ఏమిటిలెండి. ఇంట్లో పోట్లాటలు లేకుండా ఉండటానికి కొన్ని మంచి సంగతులు చెప్పాను. మరేం లేదండీ'' అన్నాను సంతోషంగా. పూర్వము మోస్తరుగా వాళ్ళు పోట్లాడుకోకుండా హాయిగా శాంతంగా జీవిస్తూ ఉంటారు. ఆవిషయమై చెప్పటానికే ఆవిడ వచ్చిఉంటుంది.

ఇల్లా అనుకొంటూ నుంచున్నాను నేను. ఆవిడ నాదగ్గరసా రావటం నేను చూడనేలేదు. వచ్చి ఆమెగారు ''నీవు ఉపదేశించిన మంత్రమే బెడిసి కొట్టింది నాయనా'' అని రహస్యంగా చెప్పేదానిలాగా చెప్పింది.

''బెడిసి కొట్టటానికి నేనేమీ మంత్రం ఉపదేశించలేదండీ'' అని ఆశ్చర్యపోయినాను.

''రాకేం నాయనా, నీకొచ్చినమంత్రాలు నీకొచ్చు, ఇంగిలీషులో మటుకు మంత్రాలు లేవంటావా ?''

కాంతం వేపుతిరిగి ''మంత్రాలు రావూ అంటారేమిటి నీమొగుడు... నేను ఇల్లాగ ఉంటే పిచ్చిదిఅనుకుంటున్నారు కామోసు. నాకు అన్నీ... తెలుసు నాయనా, కోయమంత్రాలు లేవమ్మా. అల్లాగే ఇంగ్లీషుమంత్రాలు ఎందుకుఉండవూ? ఏవమ్మా ?'' అంది.

డవండీ పిన్నిగారూ. ఉంటాయి.' అని ఆమెగారి వైపుచూస్తూ 'వచ్చునండీ. అబ్బో, ఈయనకు ఇంగ్లీషులో ఎన్నోమంత్రాలువచ్చు' అని కళ్ళు ఎగరేసింది.

'అయ్యో ఖర్మమా. ఇదేమిటండీ, నాకేంమంత్రాలూ రావు! నేను ఏమీ ఉపదేశమూ చెయ్యనూలేదు' అన్నాను నేను విచారంగా.

'అల్లాఅంఛా 'డేమిషమ్మా 'నీ మొగుడూ?' అన్నది ఆ విడ. 'ఆయ నంతే' అన్నది మాఆవిడ.

ఈఇద్దరూ ఇల్లాగ అంటూంటే నేనేమీ అనలేకపోయి నాను. నన్ను తగలెయ్య నాకిన్ని మంత్రాలు ఎల్లాగువచ్చి నయ్యా అని నాలోనాకే ఆశ్చర్యంకలిగింది.

మళ్ళీఆముసలమ్మగారు ఇల్లాగఅన్నది 'లేదంఛా వేమిషి నాయినా. మొన్నఆయన ఇంటికి రావటంతోనే 'శాంతం మొగుడిగారివల్ల నేను ఉపదేశంపొందానూ, ఇకనీకూ నా కూ పోట్లాటలుండవు, అమషా అన్నారు. ఏమిటో అనుకో న్నాను. కృష్ణారామా అనుకుంఛారు శామాలు ననుకొన్నాను. అసలు ఆయన వట్టి పిచ్చి బ్రాహ్మడు అమాయకుడు'!

'అయితే ఇప్పడు ఏంజరిగిందేమిటండీ! అన్నాను నేను

ఆరాత్రి, అంటే శుక్రవారం రాత్రినుంచే మొదలునా యినా, పిచ్చిచూపులూ, పిచ్చిమాటలూ' అన్నది విచారంగా.

13

నేనేమిపాపంఎరగనే ఇదెక్కడి అవస్థరా బాబూ'అని నాకూ ఖంగారు పుట్టింది. 'అయితే పిన్నిగారూ, ఏమిటి ఆ పిచ్చిమాటలూ' అన్నాను.

ఆభాగ్యశాలి నామాటలు వినిపించుకోకుండానేమాఆవిడతో ఇల్లాగ అంటున్నది. 'పిచ్చి మాటలు ఏమిషి కాంతమ్మతల్లీ చెప్పటానికి వీల్లేదు. అల్లాంటి మాటలు మనం ఎప్పుడూ వినము. నీవైనా చెప్పుతల్లీ నీమొగుడితో ఆమంత్రాకినివిరుగుడుఏమైనా చేయమని' అనికాంతాన్ని! కాళ్లు వేళ్లా పట్టుకొని బ్రతిమిలాడటం సాగించింది.

ఊరుకోండి పిన్నిగారూ. ఉన్నవారు ఊరుకోక ఉపదేశంచేయటం ఎందుకు చెప్పండీ ఈయన?' అంటూ మాఆవిడ ముసలమ్మగారి యందు సానుభూతి చూపటం మొదలెట్టింది అక్కడికి నేను నిజంగా ఏదోమంత్రం ఉపదేశంచేసినట్లు!

మాఆవిడ కొంటెతనం చూస్తే నాకు కోపం వస్తున్నది ఆముసలమ్మగారిని చూస్తేజాలీ కలుగుతున్నది. ఇంతకూ నాకు అసలుసంగతి ఏమిటో తెలియక 'అయితే' పిన్నిగారూ, ఏమిటాపిచ్చిమాటలు, ఎల్లాంటివి?' అన్నాను.

ఒకలాంటి వేమిషి నాయినా, చిత్రచిత్రాలుగా మాట్లాడుతున్నారు' అన్నది, ఆవిడ.

'ఎవరినైనా తిడతారా, ఏమిటీ సంగతి?'అని మళ్ళీ అడిగా నేను.

''తిట్టటమే కానీ, దీవించటమే కానీ, ఎల్లాగయినాఅవి పిచ్చిమాటలుమటుకు అవును. మనబోటి సంసారులకొంపల్లో అనుకునే మాటలు కావు'' అంటూ ఆ ముసలమ్మగారుకళ్ళ నుపమిట చెంగుతో అద్దుకొంది.

''అదిగాదండీ పిన్నిగారూ, ఆయన అన్న మాటలు ఒకటి రెండు చెప్పండి. సంగతేమిటో తెలుస్తుంది'' అన్నాను నేను.

''చెప్పండి బామ్మగారూ, చెప్పండి. సంగతేదో తెలి యొద్దూ! ఆయనకు, విరుగుడుమంత్రం వేయటానికైనా'' అ న్నది.

''చెప్పాలిసిందేనా కాంతమ్మతల్లీ! ఇంతబతుకూ బతికి ఇంటి వెనకాల చచ్చినట్లైంది. నాకర్మంకాలితే నానోటితోనే అనాలిసొచ్చింది ఆమాటలు!'' అంది ఆవిడనూ ఆవిడతో - ఆముసలికళ్ళలోనుంచి రెండు కన్నీటిచుక్కలు రాలినై.

మాతల్లిలాంటి మనిషి అల్లాగ విచారపడడం చూచి నేనూ ఎంతో కష్టపడ్డాను. అసలు ఆమెకొచ్చిన కష్టంఏమిటో నాకు బోధపడలేదు. ఏంచెపుతుందో అని ఆవృద్ధురాలివంక చూస్తూ నిలుచున్నాను.

ఆవిడా కళ్ళనీళ్ళు తుడుచుకొని రుద్ధకంఠంతో ఇల్లా అన్నది. ''నా బతుకంతా కడిగిపోస్తూన్నారునాయనా. నాము ఖంప...చంద్రుడీలాగ ఉంఛూన్నదప—'' అని ఆవిడదుఃఖం ఆపుకోలేక భోళ్ళునఏడ్చింది.

దుఃఖం కొంచెం ఆపుకొని ఇల్లాగ అన్నది మళ్ళీ,జాలి గా చూస్తూ—''నాగొంతు పట్టుకుంచారు నాయినా...పట్టుకునీ

నీగళం శంఖంలాగఉన్నదీ అంఛారు, నాగొంతుకొయ్య! ఇదీ వరస ఇల్లాఅయింది నాబ్రతుకు'' అంటూ ఆ అవ్వగారు మళ్లీ దుఃఖ పడ్డది.

నేను చెప్పిన నసీహత్ కు ఇది ఫలితంకదా అని అప్పటికి నాకు తెలిసొచ్చింది. నిజానికి నవ్వవలసిన విషయమే. కాని ఆమెస్థితిని జూచి మేము ఇద్దరం కూడా నవ్వలేకపోయినాము. మా ఉభయులకూ ఆవిడయందు జాలికలిగింది. బిక్కముఖాలతో నుంచున్నాం.

పిన్నిగారు తలుపుదగ్గరే ఒకమూలకు ఒత్తిగిలి "తెలిసిందానాయినా, ఇదీవరస. ఇంకా, ఇంకాఖండాలవుమాటలు అంఛారు బాబూ! కొడుకు లాంటివాడవు కాబట్టి చెపుతున్నాను. నాజుత్తుపా చమరీ వాలాల్లాగో, ఏదోనాపిండం, అల్లా ఉన్నదష!' అన్నది. ఆతరువాత ఒకక్షణం ఆమె మాట్లాడలేకపోయింది. నేను ఆవిడదుఃఖం చూడలేకఅన్నానూ—
"సరేలెండి ఎందుకూ ఇహ తెలిసింది.''

నామాటకు అడ్డొచ్చి ఆవిడ మళ్ళీ అన్నదీ—"చెవుతా, చెవుతా నాయినా. అంతా విను మరీ. నన్ను ఎగాదిగా చూస్తారు. పోనీ అని ఊరుకుంఛా. అయిందా, మడికట్టుకున్నా సరేవచ్చి ముట్టుకుంఛారు, ముట్టుకొని నీశరీరం శిరీషకోమల మేఅంఛారు, నన్నుతగలెయ్య!''

ఆతరువాత రెండునిమిషాలదాకా ఆవిడకంఠం పెగల లేదు. మేము ముగ్గురంకూడా నిశ్శబ్దంగా నుంచున్నాము. కాసేపటికిఆవిడనూ ఆవిడబుజంమీద చెయ్యివేసి కాంతమ్మతల్లీ నేను

చెప్పలేను ఆమాటలన్నీ నన్నుబట్టుకు ఇల్లాంటి మాటలు అంటూఉంటే నిలువునా నీరైపోతున్నాను. కాంతమ్మతల్లీ, ముప్పై ఏళ్ళు సుఖంగా కాపరం చేశాను. ఎప్పుడూఇల్లాంటి పిచ్చిమాటలు ఆయన అనగా నేవినలేదు' అని చెప్పుకొన్నది. చివరకు మళ్ళీ అన్నది-ఏంతల్లీ, ఎవరో కిరస్తానీలూఅప్రాచ్యులూ అనుకుంటారషగా అల్లాగ! ఏమోలే ఎల్లా ఏడిస్తే మనకెందుకు? మాగతి ఇల్లాఐంది గదా?'అనిదుఃఖపడ్డది ఆవిడ

ఈసంగతులన్నీ విని నేనునాలిక కొరుక్కున్నాను. మా ఆవిడ ముక్కుమీద వేలేసుకొంది. ఆవిడా కాసేపు ఊరుకొని ఏదోజ్ఞాపకం వచ్చి నట్లు తెప్పరిల్లి అన్నది-అయితే, ఇంకో టినాయినా! ఇల్లాగ పిచ్చిగా నానామాటలూ అంటున్నా, రోజల్లా ఇల్లాగ మాట్లాడరు. మధ్యమధ్య బాగానే ఉంటారు గుబులు కింద వస్తూందో ఏమో, రోజుకు నాలుగైదుసార్లుఇల్లా అంటూఉంటారు. ఈతిక్క లేనపుడు మళ్ళీబాగానే ఉంటారు

ఆముసలమ్మగారుఇల్లాగవిచారపడి ఆఖరుకుకాంతంచెవిలోఅన్నది. 'ముసలిదాన్ని పట్టుకొని, పైగా, ముద్దు ముద్దు అంటారమ్మా, ఎక్కడ చచ్చేదీ:'

ఈమాటలన్నీవిని నేనేమీ అనలేకపోయినాను. కాంతంమటుకు నవ్వు ఆపుకోలేక పోతున్న 'నేనేమీఎరగనండీ పిన్నిగారూ' అన్నాను. నేను చివరకు. నువ్వేమీ ఎరగక పోవటం ఏమిటి? నువ్వే చేశావు ఇదంతానూ!! తిరుగుడూ



మంత్రం ఏదైనా ఉచ్చాటన చెయ్యి బాబూ. మాతండ్రివి గదూ' అంటూ, నాగడ్డాన్ని మునివ్రేళ్ళతో తాకి బ్రతిమిలాడటం మొదలు పెట్టింది.

ఆమె దుఃఖం కాస్తతగ్గటం చూచి కాంతం అన్నది. 'పిచ్చిగాదండీ, అవ్వగారూ, మీముసలాయనకు పిచ్చిగాదది! మీయందు ప్రేమ కనుపరుస్తున్నారు.'

'పోనీ, నీమాటే నిజమనుకో. అల్లా అయితే మటుకు ముప్పైఏళ్ళనుంచీ లేనిదీ... ఇప్పుడు ఇల్లాగ వికారం కలగటం మంచే అంటావా? అయినా, పిచ్చికాక పోవటం ఏమిటి?' అంటూ ఆవిడ మళ్ళీ విచారపడ్డది. నేనూ, మాఆవిడాఒక్కసారి నవ్వుకొన్నాము.

మీరుఇల్లాగనవ్వితే నాబ్రతుకు ఏంకావాలె చెప్పు తండ్రీ! పోనీ, ఏభూతవైద్యుడిదగ్గరకైనా పోయి ఇంత విభూతి పట్టుకొద్దామాఅంటే, నీవు చెప్పిన ఇంగ్లీషుమంత్రానికి అది పనిచేస్తుందో చేయదో!! నాబాబుకదూ ఎట్లాగయినా నువ్వే దీనికి మళ్ళీ ఇంగ్లీషులోనే ఉచ్చాటన చేసి నన్ను బైటపడెయ్యాలె' అంటూ ఆవిడ మళ్ళీ బ్రతిమిలాడింది.

ఆవిడను తృప్తిపరచటానికి ఒకటే మార్గం ఉందని తోచింది,అదేమిటీ సరే ననటం అందుకని నేనన్నాను 'పిన్నిగారూ,పొరపాటే జరిగింది. నేనుమళ్ళీఇంగ్లీషులోఉచ్చాటనచేసి ఇదంతా పోగొడతాను మీరేమీ భయపడకండి' అని

ఆమెగారు ఈమాటలు వినిఅమితంగాసంతోషించింది "మానాయనే. నీకు ఆడపిల్లపుడుతుంది నాయనా. తప్పకుం

డాచెయ్యి" అని నన్నూ, మాఆవిడనూ దీవించి వెళ్ళిపో యింది.

ఆవిడ వెళ్ళిపోయింతరువాత కాంతం నవ్వు ఆపుకొని నాతో అన్నది—"మీరు పొరపాటు చేశారు. ఈ మెగారికి కూడా ఉపదేశం చెయ్యాలిసింది" అని.

"ఏమని" అని అడిగాను నేను.

"ఏమనా? ఆయనకు చెప్పినట్లుగానే, మొగుడి గుణ సంపదనూ, సౌందర్యాన్ని మెచ్చుకోమని."

నేను మాట్లాడ లేదు.

ఆవిడ మళ్ళీ ఎత్తుకొని ఇల్లాగ అన్నది. "మొగుడితో ఆవిడ ఇల్లాగ అనాలె—'ఓ ప్రాణనాథా, ఓ నవమన్మథా, మీ మోహనమూర్తి సందర్శనమే నాకు తన్మయత్వం కలి గిస్తుంది. మీ ముఖచంద్రబింబ సందర్శనమే నా హృదయ గభీరసాగరాన్ని పొంగు లెత్తిస్తుంది. మీమధురమైన పలు కులే......'

"చాలించు" అన్నాను విసుగ్గా.

"ఏం?" అన్నది నవ్వుతూ.

"వెక్కిరిస్తే సహించే స్థితిలో లేను నేను, ఇప్పటికే చాలావిచారపడుతున్నాను. అసలు ఇల్లాగ అవుతుందని అను కోలేదు" అంటూ నేను మేడ పైకి గబగబా వెళ్ళిపోయాను.

# మా ఆవిడ భక్తి

ఈమధ్య భజనల హడావుడి ఎక్కువైంది. ఇంటింటా భజనలు బయలుదేరినవి. మాప్రాంతాల రామభజనలు ఆగిపోయి పాండురంగ భజనలు విరివిగా కొన్నాళ్ళుసాగి ఇప్పుడు అవికూడా అంతరించినవి. ఈ భజనల విషయం కూడా అదో గాలిపాటా. స్థానిక ప్రభుత్వాధికారులవలె, ఈదేవుళ్ళూ భజనలుపొందే అధికారం కొంతకాలానికి పోగొట్టుకొంటారు.

పాండురంగ విఠల్ భజనలు వెనుకబడే సమయానికి కాకినాడనుంచి ఒక్కకుటుంబం వచ్చింది. ఒకసామాన్య వాక్యంలాగా ఒక చిన్న సామాన్య కుటుంబం అదీనూ ఇద్దరితో మాత్రం కూడుకున్నది కర్త క్రియ మాత్రమే కర్మలేదు.

వాళ్ళు వచ్చి హరనాథ్ బాబు భజనలు ప్రారంభించారు. ఈభజనలు చూడడానికి జనం విరగబడ్డారు. కాకినాడనుంచివచ్చిన ఆకుటుంబంలో ఆముసలిఆవిడే భక్తురాలు, దబ్బపండులాంటిముత్తయిదువ. ఆమెపరమభక్తురాలులాగకనబడుతుంది. భజనలు జరిపేది ఆమెగారే! ఆమెభర్త చద్దిఅన్నంతిని అంచక్కా వీధిఅరుగుపైన కూర్చుని చుట్టకాలుస్తూఉంటాడు. జహాంగీరు చక్రవర్తి రాజ్యకార్య నిర్వహణ

భారమంతా మూర్జహాన్‌కు వదలివేసి "నాకు ఓమాంసంముక్కా, ఓడొక్కు సారాయి ఇస్తేచాలు" నన్నాడట! ఈ పెద్దమనిషీ అదేవరుస.

ఆభక్తురాలుమట్టుకు తన్మయత్వంపొంది అద్వితీయమైన భక్తిలో మునిగిపోతుంది. భక్తురాండ్రు కూడాఆకాసేపూ, ఆనందంలో చిందులాడుతారు.

భజనకు ప్రారంభంలోనే,ఆవిడ, హరినాథ బాబాపటం అక్కడ పెట్టేసి, దానిముందు వెన్న పాలూ అరటిపండ్లూ అప్పాలూ మొదలైనవి ఆరగింపుకై ఉంచుతుంది. అక్కడ నుంచి అఖండమైన భజనానంతరం ఆవస్తువులలో ఏదోఒకటిఆయన ఆరగించిపోవటం. ఇది జరుగుతున్నపని.

బాబా ఆరగించిపోవటం అంటే, ఏదో ఒక వస్తువు అక్కడనుంచి మాయమైపోవటమే. భగవంతుడు బాబా అవతారంలో, ఇల్లాగ పదిమందిలోకీ వచ్చి ప్రత్యక్షంగాభక్తులుంచిన ప్రసాదాన్ని ఆరగించి పోవటం బహుచిత్రం అవటం మూలాన జనం విరగ బడటం సాగించారు. ఆమె మరీ ఉత్సాహంతో భజనలు సాగించింది.

కొందరు ఆమెను అనుమానించారు, ఏమన్నా మాయ జేస్తున్నదేమోనని. ఆమె, కొందరు స్త్రీలను ఒకప్రత్యేకమైన గదిలోకి పిలిచి, వివస్త్రయై ఎక్కడా యేమీ దాచిపెట్టలేదని రుజువు ఇచ్చింది. ఆపళంగా, అందరికీ నమ్మకంకలిగింది నిజంగా హరినాథబాబే, ఈవస్తువులు ఎత్తుకొనిపోయి భుజిస్తున్నాడని.

14

ఆమే...అక్కడ ఆవస్తువులు పెడుతుందీ...దూరంగా కూర్చుని భజనచేస్తుందీ, నీకళ్లు ఆవస్తువులమీదనే ఉంచు నీకు నమ్మకంలేకపోతే, భజన పూర్తిఅయ్యేటప్పటికి చూడూఎదో ఒకటి ఆయన ఎత్తుకొనిపోయి ఉంటాడు. ఇదేమిటి? గారడీకాదు మాయకాదు. మంత్రంగాదు తంత్రంగాదు నిజంగా జరుగుతూవున్న విషయం.

భగవంతుడు ఈముసలమ్మ భక్తికిమెచ్చి వస్తున్నాడా? సనకసనందనాది మహామునులు, వాల్మీకాది భక్తులు సంవత్సరాలతరబడి నిద్రాహారములులేక తపస్సుచేసినాఅనుగ్రహించని భగవానుడు ఈలంకపొగాకు చుట్టలు తగలేసే ఆయన భార్యకు, కనిపిస్తున్నాడా అనికొందరునాస్తికులు అన్నారు. అంటే మట్టుకు ఆమాటలకు విలువలేకపోయింది.

హరినాథ్ బాబా స్పిరిట్ వచ్చి ఇల్లాగ చేస్తున్నదనీ స్వర్గీయమైన ఆత్మలు ఇల్లాగ వచ్చి,మనతో మాట్లాడటం మొదలైనపనులు ఇప్పుడు జరుగుతున్నవనీ,పశ్చిమ దేశాలలో ఈ విషయమై కొంత పరిశోధన జరుగుతున్న విషయము నేను చదివాననీ, మాఆవిడతో చెప్పాను. అంతట ఆవిడకు ఈవిషయంలో మరీ నమ్మకం ఏర్పడింది.

ప్రతి శుక్రవారం తీరికజేసుకొని, మా ఆవిడకూడా ఈ భజనలకు వెళ్ళేది.ఒకరోజున అరటిపండ్లూ, ఇంకోరోజున వెన్నా,ఇంకోరోజునపాలూఇల్లాగప్రతిమారూఏదోఒకటిఅంతర్ధా

నమై పోతూవచ్చింది. ఆవిడకు హరనాథ్ బాబులోనమ్మకం కూడా హెచ్చుఅయింది. ప్రత్యక్షంగా కళ్ళ ఎదట పదిమంది మధ్యా జరుగుతున్న విషయాన్ని గురించి నమ్మకం కలగకుండా ఎల్లా ఉంటుంది?

౨

కొన్నాళ్ళు జరిగిన తరువాత భజనచేసే వాళ్ళల్లోనే కొందరు ఆమెను సమీపించి మీరుచేస్తేనే ఇల్లాగ జరుగుతుందా? మేము భజనచేసినా ఆరగింపు చేస్తాడా అనిఅడిగారు

మీపూర్వజన్మ సుకృతంమీద ఆధారపడియున్న విషయం అది. ఎట్లా చెప్పగలము. సంచితం ఏమీలేకపోతే ఆయన కరుణిస్తాడు. అని ఏమేమో వేదాంత వాక్యాలు నాలుగుసాగదీసి చెప్పేసి, అయినా ప్రయత్నంచేయండి. భక్తితోసాధించరాని దేముంది? భక్తివలన మీసంచితకర్మ నశిస్తుంది, భగవదాదరణా కలుగుతుంది ఆమటా అని ఆవిడగారు చెప్పినది.

తదారభ్యః కొందరు హరనాథబాబా భజనప్రారంభించారు. మొదట్లో, ఎవ్వరింట్లోనూ, ఏమీ ఆరగింపు కాలేదు.

ఈ విషయం ఆవిడతో చెప్పుకొంటే ఆవిడ 'మీరు ఇంకాతీవ్రభక్తితో భజనచేయండి. బాబాకరుణామయుడుతప్పక మీగృహాన్ని పావనం చేస్తాడు అని హితం చెప్పిపంపింది.

చాలామందివిశ్వాసంతో భజనలుఅల్లాగేచేశారుమాన కుండానాలుగైదువారాలు గడచినా దయకలుగలేదు బాబా

కు. ఆభక్తురాలు ఒక్కొక్కవారం ఒక్కొక్క ఇంటికివెళ్ళి భజనలు జయప్రదంగా సాగించింది. ఆవిడ సాన్నిధ్యంలోమాత్రం ఆరగింపు అవుతుండేది ఆవిడ పరోక్షంలోమాత్రంఎక్కడపెట్టిన వస్తువులు అక్కడే ఉండేవి కాని ఆవిడ ప్రోత్సాహం వల్ల ఆయనకు ఎప్పుడో ఒకప్పుడు దయ కలుగుతుందనేనమ్మకంతో అమ్మలక్కలు భజనలు మానలేదు.

ఆవారంలో శుక్రవారపు భజనలో సుబ్బమ్మగారింట్లో పై నుంచి కర్పూరం పడ్డదని ఒక పుకారు పుట్టింది. అంతా చెప్పుకొని సంతోషించారు.ఆవిడ మహాపుణ్యాత్మురాలన్నారు.

ఆరోజునుంచీ, ఆవిడ ఆభక్తురాలుకు అప్తురాలైంది. వాళ్ళిద్దరూ ఒకదగ్గరే కూర్చుని భజనచేయడం ఒకేసారితన్మయత్వంలోకి పోవటం ఒకేమారుఉలిక్కిపడటంమొదలెట్టారు

వాళ్ళనుచూచి ఇతరులు 'అయ్యో మనమెంత పాపులమో, మన తపస్సు ఇంకా ఫలించలేదుకాబోలు! అని విచారపడ్డారు. కాని ఎవ్వరూ నిరుత్సాహపడలేదు. అందరి ఇళ్ళల్లోనూ శుక్రవారం శుక్రవారం, భజనలు జరుగుతూనే ఉన్నాయి. మనవాడు(భక్తురాలి భర్త) లంక పొగాకుచుట్ట బాగా రూళ్ళకర్రంత లావుపాటిది వాకిట్లో కూర్చుని తగలేస్తూనే ఉన్నాడు.

3

సుబ్బమ్మగారియింట్లోపడ్డతరువాతవారంరోజులకు వెంకమ్మగారింట్లోను, తరువాత వరుసగా అన్నమ్మగారింట్లోనూ

ఆండాళ్ళగారింట్లోనూ ఆరగింపులైనాయని పుకారు పుట్టింది ఇవ్వాళ మా ఇంట్లో ఆరగింపు అయిందంటే ఇవ్వాళ మా ఇంట్లో అయిందని భజనపరులంతా ఒకరితో ఒకరు చెప్పుకొని సంతోషించారు.

ఆ స్థితిలో మా ఆవిడకూడా భజన చేస్తానన్నది. నేనన్నానూ; "మనమెందుకు చేయడం. మనం పుణ్యాత్ములమని నాకేం నమ్మకంలేదు. ఆ హరనాథ బాబు మనఇంటికి కూడా వచ్చి ఫలహారాలు ఆరగిస్తే సరేఉంది, లేనిపక్షంలో, అంతా మనలని వట్టిపాపిష్టివాళ్ళని అనుకోవచ్చు వద్దుసుమా" అని అంటే, బుర్రకెక్కి తేగా మాఆవిడకూ, "అయ్యోఅందరింట్లోనూ, ఆరగిస్తున్నాడండీ మనకర్మం ఏం గాలింది ? రంకుముండ నాగామకంటే మనం తీసిపోయినామూఅత్తలకు కోడళ్ళకు తెంపులుపెట్టి, కొంపలుతీసే రాకాసి రంగమ్మకంటే తీసిపోయినామా ! మన కెందుకు బాబా అనుగ్రహించడో చూస్తా" నన్నది. ఒకరికి ఎప్పుడూ, అపకారం తలపెట్టక గుట్టుచక్కంగా కాపరంచేస్తున్న మాయందు ఆయనకుఎందుకుఅనుగ్రహం కలగదని నాకూ నమ్మకం కలిగి సరేనన్నాను. మాపిల్లలు కూడా సరదా పడ్డారు.

సరే మర్నాడే మా ఆవిడ భజన ప్రారంభించింది. మొదటిరోజున, ఆ భక్తురాలు పాపం పని వేళా వచ్చి ఆ తంతు అంతా నేర్పింది మా ఆవిడకు. తర్వాత వరసగా నాలుగు వారాలు ఆవిడ భజన చేసింది. మా ఇంట్లోవాళ్ళా

అద్దెకున్న వాళ్ళూ ముసలీ ముతకా. అంతా ఇరవై మందిచేరే వాళ్ళు శుక్రవారం శుక్రవారం.

ప్రతిశుక్రవారం సాయంత్రం నేను ఇంటికి వడివడిగా నడిచివచ్చి, ఆఁ ఏమిటి? ఏమైంది ? ఏమన్నా, పడ్డదా అని ఆ దుర్దాగా అడుగుతుండేవాడిని. మా ఆవిడ, "అయ్యో అయ్యో మనబోటివాళ్ళకే, అంత అదృష్టం. ఈ ముఖాలు చూసే ఆయన ఆరగించడం" అని ముక్కుమూలిగేది. హరినాథ బాబు ఆరగించకపోవటానికి పూర్తిగా కాకపోయినా, చాలవరకు నేనే కారణభూతమైనట్లు ఆమె మాట్లాడేది. నేనేపాపం ఎరగనుగదా నిజానికి. అయితే ఏమిటి ? ఆవిడతో కలిసి, స్తూలు అయినా మానేసి నేనుకూడా భజనచేయలేదనీ, హరనాథ్ బాబాయందు పూర్తియైన నమ్మకం నాకు లేదనీ ఆవిడకు నాయందు కోపం.

"పోనీ నాముఖం చూసి రాకపోతే నీముఖం చూసి అయినారాకూడదా" అన్నాను ఒకరోజున నేను విసుగెత్తి. "అదికాక మొగుడు చేసిన పాపం పెళ్ళాన్ని అంటదనీ, పుణ్యంలో మాత్రం సగభాగం పంచుకొంటుందనీ, పెద్దలు అంటారు కాబట్టి నాతోనూ, నామొఖంతోనూ, నీ భజనకు ఏమీ సంబంధంలేదు. నమ్మకంతో నీవు సాగించ" మని హితం చెప్పాను.

అందరిళ్ళల్లోనూ వారంవారం భజన చేస్తున్నప్పుడల్లా ఆయన ఆరగింపుచేసి పోతున్నాడని, అందరూ అనటం ఈవిడ

ఒకర్తే ఇల్లాగ కేటాయింపు అయిపోవటం మూలాన ఆడవాళ్ళల్లో మాఆవిడకు కొంచెం చిన్నతనం అయింది. అందరిళ్ళల్లోను అయిదోవారాన జొరబడ్డ బాబా పదోవారమైనా మా ఇంటికిరాలేదు. ఆ ఆచూకీ లేదు.

"పాపపరిహారం కావాలె. సంచితం నశించాలె. ఆయనకు దయగలగాలె" అని వాళ్ళూ, వీళ్ళూ అనడంవల్ల కూడామాఆవిడకు మరీ కష్టంవేసింది. వాళ్ళంతా మహాపవిత్రులైనట్లూ ఆవిడమాత్రం పతిత అయినట్లూ!! కాని భజన మాత్రం మా ఆవిడ ఆపలేదు.

మా ఇంటికి బాబా ఆరగింపుకు రాని కారణానస్త్రీలు ఇక్కడికి రాక ఆ సుబ్బమ్మగారింటికీ ఆండాళ్ళగారింటికీ వెళ్ళడంసాగించారు. ఇంట్లో అద్దెకున్నవాళ్ళూ, మాపిల్లలూనూ ఆవిడా, పనిచేసేది, ఇంకా ఎవరైె ఒకరిద్దరుమాత్రం భజనకు కూర్చుంటూ ఉండేవాళ్ళు.

సరిగ్గా పదకొండో వారంరోజున, నేను ఇంటికి వచ్చేరావడంతోనే పిల్లలంతా ఒక్కసారి గొల్లుమని గోలచేసి, నవ్వుతూ, ఎగురుతూ నాచుట్టూ చేరారు. వాళ్ళ వెనకాల భర్తను స్వశక్తిచేత బ్రతికించుకొన్న సావిత్రిలాగా ఆవిడ నిలచున్నది. పైకి నవ్వుతున్నా కళ్ళల్లో ఎక్కడో వెనకాల కొద్దిగా విచార రేఖలున్నాయి.

ఏమిటీ ఇంతకూ, హరనాథబాబు కరుణించి మా ఇంట్లోకూడా అడుగుపెట్టాడట! కాని పండు ఫలమూ ఇటువంటివి

ఆరగించక వెండిగిన్నె ఎత్తుకు పోయినాడని చెప్పేసరికినాగుండె గుభేలు మన్నది.

ఏ వెండిగిన్నె అని నేనడగలేదు. అడగవలసిన అవసరమూ లేదు. మాఇంట్లో ఉన్నది ఒక్కటే వెండిగిన్నె. మా పసి దానికని చేయించిన దుక్కగిన్నె. యాభై అరవై తులాలబరువు, నలభై రూపాయలదాకా ఖరీదు అయింది. ఆ ఒక్క గిన్నె పోయిందనేసరికి, కష్టం వేసింది.

ఏమనటానికి తోచలేదు. హరినాథ బాబు మమ్ము మా గృహాన్ని పావనం చేశాడని సంతోషించేదా ? దుక్కగిన్నె ఎత్తుకెళ్ళాడని దుఃఖించేదా ?

"వెండిగిన్నె ఎందుకు ఎత్తుకెడతాడు ? ఎక్కడయినా ఉందేమో చూడండి" అన్నాను.

"మీకింకా నమ్మకం లేదన్నమాట" అంటూ ఎత్తుకొంది మాఆవిడ. "అందులో పాలుపోసి ఇక్కడ పెట్టానండీ. పెట్టింది నేనూ. ఇక్కడే కూర్చున్నాను. భజన చేస్తూ చేస్తూ, ఆరగించాడేమో హరనాథబాబు అని కళ్ళు తెరచి చూసేసరికి ఆగిన్నే లేదూ పాలూ లేవు. ఇదితప్పకుండా బాబామహాత్యమే" అంది,

"అయినా వెదకండి" అన్నాను.

"ఎందుకూ వెదకటం" అని మాట తోసేసింది ఆఇల్లాలు ఈసడింపుతో.

"హరనాథ బాబు పాలుతాగేసిగిన్నె ఎక్కడైనా పారేసి పోయివుండకూడదూ' అన్నాను నేను. ఈ మాట కొంచెం

సమంజసంగా కనపడ్డది కాబోలు ఆవిడా, పిల్లలూ ఒక ఘంట సేపు ఇల్లంతా వెతికారు. ఎక్కడా గిన్నె కనపడలేదు.

నేను కొంచెం విచారంగా ఉండటం మా మనిషికి బొత్తిగా ఇష్టం లేకపోయింది. పోతే పోయిందండీ భగవదర్పణ అయిన విషయంలో మనం బెంగ పెట్టుకోకూడదు. గుళ్ళు గోపురాలు కట్టించేవాళ్ళు కట్టిస్తూ వుండగా, భగవంతుడికి మన మొక వెండి గిన్నె సమర్పించుకోలేమూ, ఆయనకే కరుణ గలిగితే మనకు ఐశ్వర్యం రాదా అన్నది.

౪

రోజులు గడచిపోయినవి. మాకే విధమైన ఐశ్వర్యమూ రాలేదు. తరువాత రెండు వారాలు ఏ ఆరగింపూ లేదు. 'ఇక్కడ పెట్టిన వస్తువులలో నీకు ఇష్టమైంది పండో, ఫలమో, పానకమో, పాలో, తీసికొనిపో స్వామీ. వెండి గిన్నెలూ, అవీ మట్టుకు ఎత్తుకుపోకు. ఇదివరలో తీసుకుని వెళ్ళిపోయిందికూడా, ఎట్లా తీసికొని వెళ్ళావో అట్లాగే గప్‌చుప్‌గా ఇచ్చేసెయ్యి' అని భజనసమయంలో ప్రార్థించమనీ కళ్ళు తెరిచివుంచే ప్రార్థన చేయమని, నేను మా యింటి ఆవిడకు సలహా చెప్పాను. కాని ఆవిడగారి మతం ఆవిడదీ. నా సలహా అంగీకరించిందని నాకు నమ్మకం లేదు.

15

ఎందుచేత నంటారా, ఆ వెండిగిన్నె పోయిన తరువాత మూడో శుక్రవారంనాడు. గుండుకంచు చెంబు హారనాథ బాబు ఎత్తుకొనిపోయినాడు. అందులో పానకంపోసి అక్కడ పెట్టిందట. కళ్ళు తెరచి చూచేసరికి గుండుచెంబు పానకమూ, విచిత్రంగా మాయమైనవి.

ఈమాటుమాత్రం మాఆవిడ కొద్దిగా విచార పడ్డట్టు స్పష్టంగా కనిపించింది కాని హారనాథ్ బాబూ ఎత్తుకెడుతున్నాడని ఆవిడ కింకా గట్టినమ్మకం.

నాకుమట్టుకు చాలా కోపంవచ్చింది. 'నీవు ఇంకా భజనలు సాగిస్తావా? ఆపేస్తావా?' అన్నాను.

మరిమధ్యలో ఆపేయటం ఎల్లాగ? మనవస్తువులు మనకు ఇచ్చేసేదాకాఅన్న భజనచేయవద్దా' అన్నది నవ్వుతూ.

నేను గట్టిగా నోరు జేసుకోవాలసి వచ్చింది. 'ఇదిగో చూడూ; కాంతం నేను చెప్పేమాటలు వినకపోతివా ఇకమన సంసారం గుల్లఅయిపోతుంది. ఈహారనాథబాబు భజన వద్దని మొదట్లోనే చెప్పాను. ఏదో పండూ; పాలూ, ఎత్తుకొనిపోయింటే నాకేమీ అభ్యంతరం లేదు. వెండిగిన్నెలు గుండుచెంబులు ఎత్తుకొనిపోవటంనాకేమాత్రంఇష్టంలేదు. వారానికి ఓవస్తువచొప్పున ఇంట్లో చెంబులూతప్పాలాలూ ఎత్తుకెళ్ళుతుంటే మనగతి ఏం కావాలె? అందిందిగదాఅని ఇవ్వాళ వెండిగిన్నె ఎత్తుకొని వెళ్ళాడు; రేపు నీ మెళ్ళో కాశీ గుండ్లుకాస్తా తెంచుకొని పోతేనేనెవ్వరితో చెప్పుకొని ఏడ్చేది? కాబట్టి...

'పాపంమాటలు అనకండి. పిల్లలు గలవాళ్ళము' అంది విడ.

పాపంమాటలు నేనేం అనటంలేదు. ఆయన మహానుభావుడు కావచ్చు. కాని ఈపద్ధతిమీద అయితేమట్టుకుఆయన మనకొంపకు రావటం నాకు ససేమిరా ఇష్టంలేదు; మనవి మనకు ఇచ్చేసి, ఇక ఈకొంపకేసి తిరిగి చూడవద్దని ఆయనను ప్రార్థనచెయ్యి' అన్నాను.

ఈమాటలు విని దేముణ్ణి దూషించానని ఆఇల్లాలు చిన్నపుచ్చుకున్నది. నేను కఠినంగా మాట్లాడటంమూలానో, మా ఆవిడ నాగోల పడలేక భజనలు మాని వేయటంమూలం గాకోపంవచ్చో, కానిహరనాథ్ బాబూమళ్ళీఏమిఎత్తుకెళ్ళలేదు. అయితేఇదివరలో ఎత్తుకెళ్ళినవి తెచ్చిఇవ్వనూలేదు. 'భజనలు మానేసినట్లేనా' అన్నాను చాలా కాలమైన తరవాత ఒకరోజున 'మనస్సులో అనుకోకుండా, మీరాజ్ఞ పెడతారా' అంది ఆ పెంకె మనిషి.

ఆవిడ హృదయం మాత్రం హరినాథబాబాకు అంకితమైపోయింది. నాబత్తిడిపడలేక, ఈపాపిని సంతోషపెట్టటానికి భజనలు మానిందేకాని ఆమె హృదయపాత్ర భక్తితోనిండి ఉన్న సంగతి నేను తెలుసుకోలేదు.

# పిల్లలుగలతల్లి

కాంతం మంచంలో పడుకొనిఉంది. అప్పటికి పది రోజుల నుంచీ రక్తవిరోచనాలు. లేవటానికి శక్తి లేదు. బార్లీనీళ్ళేఆహారము. అటునుంచి ఇటు పొర్లటానికికూడా ఓపిక లేక ఆయాసపడుతున్నది. ఇంట్లో తగినంత ఆడదక్షత లేకపోవటం మూలాన బైటపనీ, ఇంట్లోపనికూడా నేనే చూచుకోవలసి వచ్చింది. నానా యాతన పడుతూఉన్నాను.

ఆరోజున సోమవారం సంక్రాంతిసెలవులు అయిపోయి స్కూలు తెరిచారు. భార్యకు జబ్బుగా ఉందీ, ఈరోజున సెలవు ఇయ్యాలిసిందని అడిగాను. స్కూలు తెరిచినరోజున సెలవు ఇవ్వటానికి రూల్సు ఒప్పుకోవు, వచ్చి తీరాలె ఒక్కపూటైనా. లేకపోతే సెలవలజీతం అంతా పోతుందన్నారు. ఏంజేస్తాము. రూల్సు!! రూల్సుకు హృదయం ఉందా? అవి కొండవీటి నల్లరాళ్ళు. వాట్లో రక్తమాంసాలు లేవు అందుకని దయాదాక్షిణ్యాలు లేవు. లేవు మరి ఏంజేస్తాను! రూల్సు! రూల్సు! రూల్సు ప్రకారం నేను ఆరోజు స్కూలుకుపోవాలె; తప్పదు.

కొంతసేపటికి తెల్లవారింది. తెల్లవారటంతోనే మా ఆవిడకు మొఖం కడిగించాను. బెడ్ పాన్ అవీ కడిగి, పక్క

దులిపి క్రొత్త దుప్పటి వేశాను. కాసిని బార్లీ నీళ్ళు కొద్దిగా పండ్లరసం ఇస్తే ఆవిడ సుఖంగా పడుకొన్నది. కొద్దిగా నిద్ర పట్టింది. ఎవరో ఒకఅమ్మను, ఆవిడను కనిపెట్టి ఉండమని చెప్పి, నేను పరుగెత్తుకొని బజారుకెళ్ళి ఇంట్లోకి కావలసిన వస్తువులూ మందూ తెచ్చాను. తరువాత నేను స్కూలుకు వెళ్ళాలిగా! వెళ్ళాను.

నేనువచ్చేసరికి ఒంటిగంటఅయింది. వచ్చీరావటంతోనే ఆవిడదగ్గఱకు వెళ్ళి మందు ఇచ్చి ప్రక్కలో కూర్చున్నాను. చాలా నీరసంగా ఉంది. కళ్ళెత్తి దీనంగా కడుదీనంగా నావైపు చూచి మళ్ళీ కళ్ళు మూసుకొంది.

ఒక్క క్షణంలో ఏదో జ్ఞాపకం వచ్చినట్లు చటుక్కున కళ్ళు తెరిపిడిచేసికొని, మీరు 'భోజనం చేశారా' అని నాగడ్డం తనముని వేళ్ళతో పట్టుకొని అడిగింది. 'లేదు. వెడతాలే. మరేమి తొందరలేదు' అన్నాను నేను. 'ఇంకా భోజనం చెయ్యలేదండీ? రెండు కావచ్చింది. ప్రొద్దునఏమైనా తిన్నారా? అయ్యయ్యో, ముందు వెళ్ళి భోజనం చేసిరండి' అని అంటూ మృదువుగా శుష్కించిన ఆవేళ్ళతో నాచెంపలు తాకింది. 'తొందర లేదులే కాంతం' అన్నాను నేను.

'ఇంకాతొందర లేకపోవటంఏమిటండీ. నాకేమీఅక్కర లేదు. మీరు వెంటనే వెళ్ళి అన్నం తినిరండి. పాపం. ఈ పదిరోజులనుంచీ మీకు తిండి అమరటంలేదు. చిక్కిసగమై పోయినారు. నాకోసం మీరేం దిగులుబడ కోకండి. నాకేం

ఫరవాలేదు. ఆకృష్ణభగవానుడు నన్ను రక్షిస్తాడు. ఆప్రభువునే నమ్ముకున్నాను'. అని చెంపలమీద వేళ్ళతో 'ద్రడం' చేసి దీనంగా చూసింది.

అయ్యో పరమ దుర్మార్గుణ్ణి. అపుడు ఆమెను ఒక ముద్దు అయినా పెట్టుకోలేదు. ఈపాడు జన్మకు ఆఅదృష్టం లేదు.

నమ్మాను ఆవిడమాటలు. భగవంతుడు భక్త రక్షకుడు అనుకొన్నాను.

కృష్ణభగవానుడుఆమెనునిజంగారక్షిస్తాడనుకొన్నాను.

ప్రభువు అన్యాయంచేశాడు.

భోజనంచేసివచ్చిన తరువాత మళ్ళీఆవిడదగ్గరకూర్చుని కాళ్ళు పిసుకుతున్నాను. "నే నెంత పాపాత్మురాలనో నండి. మీచేత కాళ్ళు పిసికించుకుంటున్నాను' అన్నది. నాకుఏమనాలి సింది తోచలేదు. భర్త అయిన వాడికి అది విధి అని చెపితే ఆవిడకు నచ్చుతుందా? నచ్చచెప్పడానికీ ఎక్కువగా మాట్లా డడానికీ అది సమయమా?' 'మరేం ఫరవాలేదు కాంతం' అని మరింత శ్రద్ధగా కాళ్ళు వత్తాను. పది నిమిషాలుకాబోలు మగతగా పడుకొంది.

ఇంతలో చటుక్కున కళ్ళు తెరచి—'మళ్ళీ మరచి పోతాను చెప్పటం. మామరదలుకు మనం త్రాగే కాఫీ సయించటంలేదు, అది ఈ కాఫీ త్రాగటం లేదట. గుండు కాఫీగింజలు ఒక సవాశేరు తెప్పించండి' అని చెప్పింది. అంత జబ్బులోకూడా గృహ నిర్వాహణభారం వదలలేదు.

ఈ మాటలు మాట్లాడడంవల్ల ఆయాసం కలిగిందో ఏమో, మళ్ళీ సొమ్మసిల్లి, కళ్ళుమూసింది.

ఇంతలో రాధాయ, విజయ పలకపుల్లకోసం పోట్లాడుకొన్నారు. 'అమ్మా చూడవే. నాపలకపుల్ల అబ్బాయితీసుకొన్నాడు.' అని అమ్మతోకంప్లెంటు చేసింది. పసివాడు వచ్చి ఆ పలకపుల్ల దానిదికాదే నాదేను. అదితీసుకొనినాకివ్వనంటే నేనులాక్కున్నా, నన్నాడు. ఈ ఇద్దరిమాటలువిన్నది. అంత జబ్బులోఉన్న మనిషికి ఈకుక్క జట్టీలన్నీవిని సద్దటానికిసుజానికి ఎంత విసుగు!

నాకే కోపం వచ్చింది. పో వెధవ. 'పోఅవతలకి. అమ్మకుజబ్బుగా ఉంటే వెధవకంప్లెంట్సు అన్నీ తీసుకొస్తావు,' అని విసుక్కున్నాను.

నాకుకోపం వచ్చింది. ఆమెకు రాలేదు. నేను విసుక్కున్నానుగాని ఆమె విసుక్కోలేదు. నామాటలువిని ఆమె 'అల్లా అనకండి. వాళ్ళకేం తెలుసు? రానాన్నా. మాతండ్రీ రారా. మాఅమ్మా, చిట్టితల్లీ. రా అమ్మా' అని వాళ్ళిద్దరినీ ప్రక్కలోకూర్చో పెట్టుకొని ముద్దాడింది. ఆ తల్లి ముద్దులో ఏంమహాత్యంఉందో కానీ, వాళ్ళిద్దరు తమ పోట్లాటను, ఆక్షణంలో మరచిపోయినారు. ఆతగూాఇట్టె తీరిపోయింది. చిన్నది తల్లి మెడను కౌగలించుకొంది. రాధాయతల్లి కాళ్ళమీద పడ్డాడు.

ఆ మాతృ హృదయం, ఈపుత్ర పుత్రికాగాత్ర పరిష్వంగంలో ఎంత సంతోషించిందో, ఆమె ఎంతటి బ్రహ్మానందం పొందిందో.

కానీ,

నేనువచ్చి, పాపిష్టిముండా వాణ్ణి, నేనేవచ్చి, లేవండి నాన్నా, అమ్మమీద పడబోకండి. అమ్మకు జబ్బుగాఉంది,' అని వాళ్ళిద్దరిని చెరో రెక్కతో పట్టుకొని మంచం దింపి హాల్లో దిగవిడిచి వచ్చాను. తల్లి పాపం, దీనంగాచూచిందే కానీ మాట్లాడలేదు. ఆ మాతృహృదయం పొందిన పరితాపమంతా ఆ నీరసించిన కళ్ళలోచూడటానికి నాకు కళ్ళు లేక పోయినాయి.

తల్లినీ పిల్లలనూ వేరుచేసింది నేనే. ఆరోజున దుర్మార్గం చేశాను. నేనే ఈ చేతులతో విడతీశాను. ఈచేతులను ఏమహాత్ముడైనా ముక్కలు ముక్కలక్రింద నరికి, కాకులకూ గద్దలకూ వేసి పుణ్యం గట్టుకుంటే బాగుండు.

పిల్లలు తల్లిమీద పడి ఆవిడకు బాధకలుగజేస్తారనుకొన్నానుగాని, అదే ఆఖరు సారిగావాళ్ళు మాతృమూర్తిని ధ్యానిస్తూ ఉన్నారని నేను ఊహించలేక పోయినాను.

మా ఆవిడకు జబ్బుగా ఉందని తెనాలినుంచిడాక్టరుగారువచ్చారు. ఆయనకు ఎక్కడ మర్యాదతక్కువఅవుతుందోననిఆదుర్దాపడి ఆవిడ మూడు గంటలకునన్ను దగ్గరకు పిలిచి చెవిలో అన్నదీ, 'డాక్టరుగారికి ఫలహారం తెప్పించారా'అని. 'లేదు' అన్నానునేను. 'చూశారా. పెద్దమనిషి. మనఇంటికి ఎందుకొస్తాడు చెప్పండి. ఆయనమాతమ్ముడ్నిపట్టి, నన్ను, చూడటానికివచ్చాడు. కోటయ్యనుపంపి ఫలహారంకాఫీ తెప్పించిఇయ్యండిఅనిఅన లేకఅన లేకఅన్నది.ఇకగంటలలో ఉంది ఆమె

ప్రయాణం. అయినా ఆమె కుటుంబవిషయమై జాగ్రత్తపడుతునే ఉంది.

ఆరోజు సాయంత్రం కూడా మళ్ళీ నన్ను పిలిచింది సంజ్ఞాపూర్వకంగా. మాట చాలా నీరసంగా ఉండటం మూలాన వంగి, ఆ మాటలు వినటానికి ప్రయత్నించాను. చూడండీ. సాయంత్రానికి పిల్లలు ఏమైనా పెట్టమంటూ వస్తారు. మధ్యాహ్నం తెచ్చినవి ఏమైనా మిగిలి ఉంటే సరేసరి. లేకపోతే కాస్త నా చెయ్యమనండి అత్తగారిని. పసివెధవలు ఆడుకొని వచ్చి ఏమైనా పెట్టవే అమ్మా అంటూ వస్తారు. వాళ్ళసంగతి కాస్త చూడమనండి ఆవిడను'. అన్ని మాటలు నీరసంగా ఒక్కొక్క మాటే అనలేక, అనలేక అని మళ్ళీ కళ్ళు మూసింది.

గంట గంటకూ నేను మందు ఇస్తూనే ఉన్నాను. ఎత్తిపోస్తు నేవున్నాను. విరోచనాలు తగ్గలేదు. రాత్రి ఎనిమిది దాకా ఆవిడ మాట్లాడలేదు. ఎనిమిదింటికి అత్తగారు ఆవిడ ఎదుటకు రావటం చూచి 'పిల్లలు అన్నం తిన్నారా? శాస్త్రి కడుపు నిండా తిన్నాడా. పిచ్చివెధవ వట్టి అమాయకుడు, అని అన్నది. తిన్నారమ్మా అంతా తిన్నారు. నేను తిని నీదగ్గరకు వస్తాను' అని మాపిన్ని అంటే ఆవిడ గుడ్లనీళ్ళు తిప్పుకొని మీరే చూడాలె వాళ్ళని' అన్నాదట. పక్కనున్న మహాలక్ష్మమ్మగారు వృద్ధురాలు 'నీకేమీ ఫరవాలేదమ్మా పిచ్చితల్లీ నీకేం ఫరవాలేదు' అని ధైర్యం చెప్పితే, విని కళ్ళు విప్పి ఎదురుగా కావలెనని పెట్టిఉంచుకొనిన కృష్ణుడిపటానికి రెండుచేతులెత్తి నమస్కరించి మళ్ళీ మగతగా పడుకొంది.

జబ్బు బలంగా ఉందని ఆదుర్దా పడుతున్నాము కాని, ఇంతపని అయ్యే స్థితిలో ఉందని మేము కలలోనైనా అనుకోలేదు ఆస్థితిలోకి దిగుతుం దేమో అని భయపడ్డాముగాని, ఇదివరకే దిగిందీ, ఇక కొన్ని గంటలకాలమే వ్యవధి ఉందీ అని మేమెవ్వరమూ ఊహించలేక పోయినాము ఆమహాలక్ష్మమ్మగారు గ్రహించిందట. ఆమె మాకు చెప్పలేదు.

రాత్రి ఎనిమిదిగంటలదాకా అంటే ఆవిడ ఈలోకపు గొడవలో ఉన్నంతవరకూ, స్పృహ తెలిసినంతవరకూ, భర్త పిల్లలూ, బందుగులూ, స్నేహితుల విషయమైకనుక్కో వలసిన విషయాలన్నీ కనుక్కుంటూనే ఉంది.

ఎనిమిది గంటలకు నాతో కడసారి అన్నమాటలు ఏమిటీ? చూడండీ, ఆరాధిగాడు, చిట్టీ, పోట్లాడుకొంటున్నారు. మీరు వెళ్ళి ఆఇద్దరినీ,పక్కలోపడుకో పెట్టుకొని నిద్రపుచ్చండి ...ఆపాపకు కథ చెప్పండి. కథ చెపితేగాని నిద్రపోదది.రోజూ చెప్పే ఆ మేక కథే చెప్పండి నిద్రపోతుంది అది అన్నది.

నేనూ,''పోనీలేవే. కాసేపుపోట్లాడుకొని వాళ్ళేనిద్రపోతారూ''అంటే.''అల్లాగకాదు మీరు నాదగ్గర ఉండనక్కర లేదు. నాకు అవసరం ఉంటేపిలుస్తాను లెండి''అని నన్నుపిల్లలను నిద్రపుచ్చటానికి పంపింది.

మాతృప్రేమ ఎంత విలువైంది. ఈలోకంలో ఉన్నంత వరకూ,తనకు తెలివి ఉన్నంతవరకూ, మంచంలో ఉండి, అంత

జబ్బులో ఉండీకూడా ఇంటికి సంబంధించిన అన్ని విషయాలూ చూచుకొన్నది. పిల్లలకు ఏమి కావాలో చూచింది. భర్త కష్టపడుతున్నాడే అని ఆవేదన పొందింది. వచ్చినబంధువులకూ, మిత్రులకూ మర్యాదలో ఏమిలోపం జరుగుతుందోఅని ఒక కంట కని పెడుతునే ఉంది. పిల్లలతగూలు తీరుస్తూనేఉంది. మంచంలోఉండీ. తెరవలేక తెరవలేక కళ్ళు తెరుస్తూగృహ కృత్యాలన్నీ నిర్వహిస్తూనే ఉంది.

ఎనిమిది గంటల తర్వాత-?—? ???

బాధ, బాధ, బాధ, బాధ, మూల్గు ... చెప్పలేదు ఏమిటో బాధ.

సుమారు రెండుగంటలప్పుడు మట్టుకు 'ఎక్కడున్నారు, అంది.' 'ఎక్కడోనా తల్లీ, ఇక్కడే-నీమంచంకోడును తలను ఆనించుకొని,కూర్చుని ఉన్నా.''

నావంక తిరిగి, నన్ను కన్నెత్తి చూడలేదు-

విరోచనం అయినట్లు ఉందీ అన్నది. వెంటనే ఆయిల్ క్లాతు తుడిచివేసి పైన తెల్లటి వస్త్రము వేశాను.

అట్లాగే గుడ్డు పెట్టికొని చూస్తున్నాను.

ఆమె నిద్రపోలేదు మూల్గుతున్నది.

వళ్ళు పట్టుకొని మాటిమాటికి చూశాను.

ఎప్పుడూ వేడిగానే ఉండేది.

ఎదటనే గడియారం గోడపైనున్నది. ఎదుట గదిలో తక్—తక్—అని నీరసంగా రెండు కొట్టింది. చూస్తూ

కూర్చున్నా - నాకు ఆమె స్థితినిగూర్చి భయం కలుగలేదు. దుఃఖం గలగ లేదు. ఏమీలేదు. మనస్సులో ఆలోచనలు ఏమీలేవు. . .శూన్యం. గడియారపు టక టక శబ్దం దూరా నుంచి చాలా మందంగా వినిపిస్తున్నది. నేనూ,మహాలక్ష్మమ్మ గారూ, అల్లాగ కూర్చున్నాము.

అల్లాగ చూస్తూ కూర్చున్నాను.

నేనొక శిలామూర్తిని అయిపోయినాను. నాచూపులు ఆ అవిలోకితేశ్వరుని చూపులు అయినై.

తక్ — తక్ — తక్— మూడు కొట్టింది.

మళ్ళీ ఒకసారి శరీరాన్ని తాకి చూశాను. చూశానే గాని ఎందుకో, తెలియదు. డాక్టరు గార్ని లేపాను. ఎందుకంటేఅప్పుడు ఆమె బాధో బాధో అని విపరీతమైన బాధ పడ్డది.

ఆయన వచ్చి ఒక్క ఇన్‌జెక్షన్ ఇచ్చాడు.

ఇచ్చీ ఇయ్యటంతోనే కళ్ళుమూసింది. మూల్గుమా నింది. నేను డాక్టరుగారి వంక దీనంగా చూశాను. ఆయన భయంలేదు. నిద్రపోతుంది; లేపబోకండి అన్నాడు.

బాధతగ్గిఆవిడకు నిద్రపట్టింది. ఆవిడ బాధ పడటంలేదు నిద్రపోతున్నది అన్నభావం మనోవ్యథను కొంత తగ్గించి ఉంటుంది. కాకపోతే మరేదో విచిత్రమై, అనూహ్యమైన కారణమైనా ఉండాలె. ఎందుకంటే నాకూ అప్పుడే కొద్దిగా

కునుకు పట్టింది. ఆమె మంచపు పట్టెపై తల మోపి కళ్ళు మూశాను.

ఎంతసేపు? నాకు తెలియదు.

ఉలిక్కిపడి కళ్ళు తెరిచాను. వెంటనే నా సుఖదేవత ముఖంవంక చూశాను. ఏదో భయం వేసింది. తల్లీ అని గడ్డం పట్టుకొన్నాను.

ఇంకేంముందిమహాప్రభో—కొయ్య, కొయ్యగాఉంది.

చూస్తుండగానే కఫం అడ్డ పడ్డా, అతి కష్టంమీదఏవో కొన్ని మాటలు అన్నది. నాకు తెలియలేదు. రుక్కూ, మంగా, శాస్త్రీ, రాధా, విజయా అని పేరు పేరునా పిల్లలను పిలిచి అతి కష్టంమీద రెప్పలెత్తి వాళ్ళను చూచింది. వాళ్ళంతా నమస్కరించి, 'అమ్మా' అన్నారు.

అమ్మ పలకలేదు.

నేను పక్కనే ఉన్నాను. తల్లీ—కాంతం—అన్నాను. కళ్ళెత్తలేదు. ఈ పాపిష్టిముండా వాణ్ణి చూడకపోవటమే మంచిది.

అమ్మా, అమ్మా, అమ్మా, అమ్మా, అమ్మా, అని అయిదుగురు పిల్లలూ అల్లాడి పోయినారు. అమ్మా అని పిలవటానికి అదే, ఆఖరు.

గోడనున్న గడియారం అయిదుమీద ఆగిపోయింది. కాకులు కా, కా, అనుకొంటూ ఎక్కడికో, ఏకొత్తదేశా

లక్షో లేచి పోతున్నవి. సావిట్లో కట్టి వేసిన లేగదూడ 'అంబా అంటూ తల్లడిల్లి పోతూఉన్నది.

నాపిల్లలకు తల్లిలేకుండా పోయింది. నాకాంతం ప్రపంచానికంతా అయిపోయింది.

సంపూర్ణము.



# శ్రీ వేదాంతకవిగారి రచనలు

| | | | | |
|---|---|---|---|---|
| వటాలు | | 1 | 0 | 0 |
| ితాసంస్థానం | | 2 | 0 | 0 |
| ్వాయ్చువ్వలు | | 0 | 12 | 0 |
| ండయాత్ర | | 1 | 0 | 0 |
| రదలు | | 1 | 0 | 0 |
| గడుగ్గాయి | | 1 | 0 | 0 |
| వినరసాలు | | 0 | 8 | 0 |
| భగవన్మతభాష్యం | 1 వ భాగము | 1 | 4 | 0 |
| డిట్టో | 2 వ భాగము | 1 | 0 | 0 |
| నాయుడు బావ | | 1 | 0 | 0 |

### శ్రీ ఉమర్ ఆలీషా గారి

| | | | |
|---|---|---|---|
| ఉమర్ ఖయ్యాం | 3 | 0 | 0 |

### శ్రీ విశ్వనాథ సత్యనారాయణరావుగారి

| | | | |
|---|---|---|---|
| ంధ్రపౌరుషము | 0 | 6 | 0 |

వలయువారు :—

## శ్రీ సత్యనారాయణ బుక్ డిపో,

రాజమండ్రి.

## శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారి రచనలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | కాంతం కైఫీయతు | 1 | 0 | 0 |
| 2. | కాంతం కాపురం | 1 | 0 | 0 |
| 3. | కాంతం | 1 | 0 | 0 |
| 4. | నేనూ మాకాంతం | 1 | 0 | 0 |
| 5. | మునిమాణిక్యం నాటికలు | 1 | 0 | 0 |
| 6. | మునిమాణిక్యం కథలు | 1 | 0 | 0 |
| 7. | ఉపాధ్యాయుడు | 1 | 0 | 0 |
| 8. | తిరుమాళిగ | 1 | 0 | 0 |
| 9. | మేరీ కహానీ | 1 | 0 | 0 |
| 10. | దాంపత్య జీవితం | 1 | 0 | 0 |
| 11. | రేడియో నాటికలు | 1 | 0 | 0 |
| 12. | రాధబాబు | 1 | 0 | 0 |
| 13. | శరద్రాత్రులు | 1 | 0 | 0 |
| 14. | రుక్కుతల్లి | 1 | 0 | 0 |
| 15. | యధార్థ దృశ్యాలు | 1 | 0 | 0 |
| 16. | హాస్యకథలు | 1 | 0 | 0 |
| 17. | తల్లిప్రేమ | 1 | 0 | 0 |
| 18. | కథానికలు | 1 | 0 | 0 |
| 19. | దీక్షితులు | 1 | 0 | 0 |
| 20. | తగూ నెం. ౧ | 1 | 0 | 0 |
| 21. | వినోద వ్యాసములు | 1 | 0 | 0 |
| 22. | నా స్నేహితులు | 1 | 0 | 0 |

కలయువారు :

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.